ధ్యక్ష్ ఖాషాగారికి హైదరాబాదు జిల్లాలో క్రైస్తవమతములోనికి జనులు గొంపోవుచున్నట్లు తెలియజేయబడినది. అందుపై శ్రీ ఠక్కరుగారు తనకు తెలిపిన అంశములను గూర్చి విపులమైన నివేదిక నంపవలసినదిగ కోరగా ఆక్కడి హరిజన సేవక సంఘమువారు ఈ క్రింది నివేదిక నంపినారు.

"హైదరాబాదు జిల్లాలో ౪౦ ఏండ్లక్రిందట ఆ గ్రామమందు మెథడిస్టు యపిస్కోపలు క్రైస్తవ మిషను ఒకటి స్థాపించబడెను- అమిషను యొక్క ప్రయత్నముల చే ౧౯౩౧ వ సంవత్సరము వరకు సుమారు ౩౦ వేల సంఖ్యగల హరిజనులు క్రైస్తవమతములో చేర్చుకొనబడిరి. విశేషముగా చమార్లతెగవారలు ఈ విధముగ మారిరి, వారిలో ప్రతి ఎక్కువగా పైకో పాహాపూరు; ముద్రాపూరు; వనగరు తాశాలలో నుండు రు-లారలలో అనేకులు ౧౯౧౮ లో హిందూమహసర్మల కొట్లాటలు జరిగిపోయినవెంటనే క్రైస్తవమతమవలంబించిరి. ఈ మిషనుకు ఆగ్రాలో ప్రధాన కార్యస్థానముగల ఒక జిల్లా అధికారియు, జిల్లాలో పలిభాగమందు పనిచేయుటకేర్పాటు చేయబడిన అనేకులు క్రింది అధికారులును, మతబోధకులును వీరలలో యూరపీయులేగాక భారతీయులును, పురుషులేగాక స్త్రీలును గలరు. ఈ మిషనుకు ఆగ్రాలో ౬౦ వేల ఎకరముల భూమిపై చాలగొప్ప ఏర్పాట్లున్నవి. అచట బాడుగకపిగాక సొంతయిండ్లు అనేకములు గలవు: అందు మాధ్యమిక దశవరకు విద్య నేర్పు బాలబాలికల ఇంగ్లీషు పాఠశాలలును. పరిశ్రమలు నేర్పు పాఠశాలయొకటియు సాంకేతిక విద్య నేర్పుబడి యొకటియు నిర్వహించబడుచున్నవి- మరియు అమిషనువారు చిన్నచిన్న పట్టణభాగములలోను, ముఖ్య గ్రామములలోను సొంతభూము లనుసంపాదించి అందు సొంతభవనములనుకట్టించినారు-అభవనములయందు ప్రతివారము క్రమముదప్పక ప్రార్థనలు జరుపబడుచుండును.

గతసంవత్సరము అచటికి రోమను క్యాథలిక మిషను వచ్చెను. అది మొదలుకొని రెండుమిషనులును పూర్వముకంటె ఎక్కువచురుకుగా పనిచేయుచున్నవి-రోమను క్యాథలిక మత బోధకులు మొదట పూర్వము ప్రొటెస్టెంటు క్రైస్తవమతములో చేరినవారలవద్దకుపోయి, వారలను తమ మతములోనికి మార్చుకొనయత్నించిరి. అనేకులను తమ వైపునకు మార్చుకొనగల్గిరి-ఇపుడు వారలు క్రొత్తవారలను తమమతములో చేర్చుకొనుటకు యత్నించుచున్నారు,

పోయినసెలలో పత్రికలలో కనపడినవార్తలు పైకో, సవాల్ ఖానాలలో క్రొత్తగా కొందరిని క్రైస్తవమతమునకు చేర్చుకొనుటకు సంబంధించినట్టివి-కాని పైకో సంగతివేరు. అది అజ్ఞాఅంతటిలోను చాల పెద్దదియు ఎక్కువజన సంఖ్య గలదియు ఆకు తానాకు ప్రధాన స్థానము- మిషనరీలు అచోటపకే గ్రద్ధృష్టితో ప్రయత్నము చేయదలచియున్నట్లున్నవి; ఇరువురకు ఇచట వేర్వేరు ఏర్పాటులున్నవి ఇరువురును, అనేక మతబోధకులను, పురుషులనేగాక స్త్రీలనుకూడ ఏర్పాటుచేసికొనినారు రోమను క్యాథలిక్కులు పూర్వ ప్రొటెస్టెంటు మతములో చేరినవారల నేకులను తమపక్షమునకు త్రిప్పుకొనగలిగినారు. ఇపుడు వారలను గ్రామజనులకు క్రైస్తవ మతము బోధించి,వ్యాపింపచేయుటకై పంపు చున్నారు, వారలు పూర్వము తమమతములో చేరియుండినవారలలో నిరుద్యోగులను, విద్యావంతులను ఉపాధ్యాయులనుగ నియమించి, వారిద్వారా మతప్రచారము సాగించుచు క్రొత్తవారలను తమ మతములోనికి రాబట్టుకొన గలుగుచున్నారు. విచారణచేయగా, వారలు విశేషముగా చమార్లలో ప్రచారము చేయుచున్నట్లు, ఆ తెగనుండి కొందరు క్రొత్తగా క్రైస్తవులైనటులను తెలిసినది.

గ్రామమునకుపోయి హరిజనులతో పరిచయమేర్పరచుకొనినవెంటనే, వారలు ఒక పాఠశాలను ప్రారంభించి దానినిస్వయముగా పలుకుబడిగలవాని బంధువైనట్టియో ఒకహరిజనునికి అప్పగింతురు. హరిజనులకును ఇతర గ్రామవాసులకును ఏదో సంఘర్షణయో లేక కోర్టువ్యవహారమో జరుగుచున్నటుల తెలిసినవెంటనే వార

# హరిజనులు మతము మార్చుటేల?

గాంధి మహాత్ముడు

లు, సమయమును జూచి దిక్కులేని హరిజనుల పక్షమువహించి వారలకు మాటలసహాయమో మాత్రమేగాక డబ్బిచ్చికూడ తోడ్పడుదురు. అట్లు అమిషనరీలు హరిజనోద్ధారకులుగ గణించబడుటచే, దానికి ప్రతిఫలము నిచ్చినటుల, హరిజనులు అమిషనరీలమతములో చేరుదురు.

అమిషనరీలు ఈ తానాలో దూరమువనుండు గ్రామాలలోగూడ పనిచేయుచుండుటచే, ఇప్పుడు చేసిన విచారణచాలదు. వీరల ప్రచారముతగిలిన గ్రామములెన్ని యైనదియు, ఎంత మంది మతముమార్చినదియు సరిగా తెలియకున్నది. పైకో తానాలో ౧౩ గ్రామములలో విచారణచేయగా మొత్తముమీద ౬౦౦ మంది మతముమార్చియుండ వచ్చుననియు, వారలలో ఒక పాతికభాగము పూర్వమెపుడో మతముమార్చియుండురనియు, తక్కినవారలందరును క్రొత్తగా మతముమార్చినవారలే అయియుండవలెనని మొ తెక్కతేలినది. రెండుతెగల మిషనరీలును ఇదేవిధముగ మరికొన్ని తానాలలో మతప్రచారము చేయుచు కొద్దిగనో గొప్పగనో జయముపొందుచున్నారు. ఈ విషయమై సరియైన లెక్కలను సంపూర్ణముగ సంపాదించుటత్వరలో జరుగవలసిన అవసరమున్నదనిపించుచున్నది- ఇటీవల క్రొత్తగా చేయబడిన మతపరివర్తనల విశేషలక్షణము గుంపులుగుంపులుగా మతము మార్చుట యైయున్నది- ఏ గ్రామములో గాని హరిజనుల పెద్దయగువాడు క్రొత్తమతమును అవలంబించినపుడు అతని తెగకు సంబంధించినవారలందరును అతనినను బడిగ సరింతురు కొక్కప్పుడు మంచిపలుకుబడి సర్దారు ఒక అనేక గ్రామములనుండి తనతెగవారల మతము మార్పించుటకు తోడ్పడును- ఇట్లు ఈ ప్రచారము అధికముగా వ్యాపించుచున్నట్లు కనపడుచున్నది- త్వరలో మతముమార్చినవారల సంఖ్య మనమనుకొనునంత విపరీతముగ పెరిగిపోగలదు.

పూర్వము మతముమార్చినవారలైనను క్రొత్తగామార్చిన వారలైనను, ఒక్కరుకూడ క్రొత్తమతమందు విశ్వాసముగలవారలగుటచే మతము మార్చియుండినటులు కనుగొనజాలము, మిషనరీలు చేసిన ప్రచారము విజయవంతమగుటకు కారణము హరిజనులు తమదుస్సహపరిస్థితులను ఎంతమాత్రము భరించలేక, క్రొత్తమతములో చేరి వాటినుండి తప్పించుకొనజాలుదురనియే. కాబట్టి మతముమార్పుటకు కారణములను ఒక్కమాటలో ఆర్థికములనిగాని కొంతవరకు ఆర్థికము కొంతవరకు సాంఘికములనిగాని చెప్పవచ్చును. సాధారణముగా, హరిజనులు అనేకములైనపీడనములకు లొంగవచ్చుటయేగాక అవమానకరముగువిధమున చూడబడుదురు. ఇది ఇపుడు వారలకు ఆగ్రహము కలిగించుచున్నది. అందుచే వారలు తియగబడినపుడు, పలుమారులు కొట్లాటలు సంభవించి ఒక్కొక్కప్పుడు వాటిసంబంధములగు నేరములు న్యాయస్థానములవరకు పోవుచుండును. ఈ పరిస్థితులను మిషనరీలుగమనించి ఉపయోగించుకొందురు. కాని ఈ మతపరివర్తనము లు ఆస్థిరములే.

పూర్వము మతముమార్చినవారలలో చాలమంది ఇప్పటికిని తమపూర్వ మతాచారములను సాంఘికాచారములను, కర్మలను మాన్పుకొనక ఆచరించుచున్నారు. వారలలో కొందరు అప్పుడే తమ పూర్వమతములో చేరినారు. పేరుకుమాత్రము క్రైస్తవులుగనుండుచున్న క్రొత్తవారలును, ప్రాతవారలునుకూడ తమకష్టములు తీర్చబడినచో హిందూమతమందు చేరుటకు సంసిద్ధులైయున్నారు, విచారణలో తేలినవారికష్టములు ఈ క్రిందసంక్షిప్తముగ సూచింపబడుచున్నవి.

౧. ఇతర గ్రామములలో అదేపని చేసినవారలకు దొరకుకూలికంటె సగమో అంతకుమించియో తక్కువయగుకూలికి వారలుతమ గ్రామములలో తమయజమానులకును, ఇతరసవర్ణహిందువులకును పనిచేయవలసివచ్చుచున్నది.

౨. తమయజమానుల ఇండ్లలో పెండ్లిండ్ల పుట్టువు, కర్మాంతరములందును హరిజనులు వారలకొఱకును, ఆ గ్రామస్థులగు ఇతరసవర్ణహిందువులకొఱకును కష్టము చేయవలసివచ్చుచున్నది.

మ॥ ఘ॥ వ॥ శ్రీ నిజాం ప్రభువుగారి జన్మదినోత్సవ

సందర్భమున

నిజాంరాష్ట్రమునుండి వెలువడు

ప్రథమాంధ్ర దినపత్రిక

# తెలంగాణా

'రయ్యతు' పత్రికాధిపతులగు

మందుముల నరసింగరావుగారి

సంపాదకత్వమున

రాజధానీ నగరమగు హైద్రాబాదున

౧౯౩౭ సెప్టెంబరు ౭ వ తేది (౧౩౪౬ ఫ. ఆబాన్ ౨ వ తేది)

నుండి

ప్రకటింపబడును.

3. కుటుంబమున కొకి సంవత్సరమునకు ౬ అణాలు ఇంటిపన్ను వసూలు చేయబడుచున్నది.

౪ వారలు ప్రతిచచ్చినఆవు, ఎద్దు, లేక దున్నపోతుయొక్క చర్మముకొరకై వారియజమానులకు ఒక్కొక్కదానికి ఒక్కొక్కజత చెప్పులచొప్పున ఇవ్వజాలనిచో పైజెప్పినజంతువు తెగనుబట్టి వరుసగా రూ ౧, రూ ౨లు, రూ ౩లు, లేక రూ ౪లు చెల్లించవలసియుండును.

౫. సవర్ణహిందూ గ్రామస్థుల ఇండ్లలో హరిజన స్త్రీలు కాన్పులు చేయవలసి వచ్చినపుడు ఆడపిల్లయైనచో నాలుగణాలు, మగపిల్లవాడైనచో రెండణాలుమాత్రమే ఇత్తురు. ఇదికూడ సరిగా చెల్లించరు.

౬. వారలు జబ్బుగానున్నప్పుడుగాని, వివాహాదికార్యములందు, లేక మతక్రియలందు మునుగ్నులై యున్నప్పుడుగాని, తమవ్యవసాయావసరములనుకూడ లెక్కపెట్టక తమయజమానులకొఱకును, సవర్ణహిందూ గ్రామస్థులకొఱకును కష్టపడి పనిచేయవలసియుండును.

౭. వారలపై చౌకీదారిపన్ను సాధారణముగా చాలఎక్కువగా నుండును. సవర్ణహిందువులుపయోగించు బావులనుండి వారలను నీరు చేదుకొననీయరు.

౮. వారలు సవర్ణహిందువులు ఉపయోగించు బావులనుండి నీళ్లుచేదుకొనుటకు వీలులేదు

౯. వారలను దేవళములలోనికి రానీయరు. మతకథలను చెప్పుటకు వారలయిండ్లకు బ్రాహ్మణపురోహితులు రారు.''

ఇదినివేదిక. ఈనివేదికలో మతపరివర్తనలనుగూర్చి చెప్పబడినది సత్యమేయగుచో, నాదృష్టిలో నదిమాన్యము- అట్టిపై ప్రవర్తనములవల్ల అనుమానములును విరోధములును ప్రబలుటతప్పు ఆశ్చర్యమేమియు లేదు- కాని ఏమిషనరీ సంస్థగాని, లేక మతప్రచారముచేయు వ్యక్తులుగాని ఈనివేదికలో చెప్పబడినపద్ధతుల నవలంబింపదలచియున్నచో వారలను ఏదియు అడ్డుపెట్టజాలదు- కాబట్టి దృష్టినిలోనికి మనలించి ఆత్మపరీక్షణచేసికొని మనలోనితప్పులను కనుగొనుట యుక్తము- అదృష్టవశమున ఈనివేదిక మనకట్టిఅవకాశ మొసగుచున్నది- హరిజనులు హిందూమతమునుండి లేచిపోవుటకు తొమ్మిదికారణములు చెప్పబడినవి- అందుఏడు కారణములుపూర్తిగా ఆర్థికములు, ఒకటిసాంఘికము, ఒకటిపూర్తిగా మతసంబంధము- ఇట్లు హరిజనులు ఆర్థికముగాహీనులుగను, సాంఘికముగ నీచులుగను, మతమునుండి బహిష్కృతులుగను నున్నారు- ఇపుడు వారలు హిందూమతమునుండి లేచిపోవుట ఆశ్చర్యముకాజాలదు- మనమాశ్చర్యపడవలసినది ఇంతకాలమునుండి వారట్లు లేచిపోకుండ ఉన్నారాయనియు. ఇప్పటికైనను అంతకొద్దిమంది మాత్రమే ఏలలేచిపోవుచున్నారాయనియు అయియున్నది- ఇదినేర్పుపాఠము గ్రాహ్యమే- షాహాబాదులో కనుగొనబడినటువంటి విషయము లెప్పుడెప్పుడు కనుగొనబడునో అప్పుడెల్లమనము పూర్వముకంటెఎక్కువ ఆత్మశుద్ధికిని, హరిజనోద్యమమునకైపూర్వముకంటె ఎక్కువసేవచేయుటకును, హరిజనులతో పూర్వముకంటె ఎక్కువకలిసియుండుటకును మనోనిశ్చయము చేసికొనవలెను- స్థానిక హరిజనసంఘమునకు ఒకవైపు హరిజనులసేవజేయుటకును, ఇంకొకవైపు సవర్ణహిందువులలో ప్రచారము చేయుటకును, తిట్టుటగాను- వారలకు హరిజనులయెడ నాంబునడచుకొనుచున్నవిధము మతసమ్మతమైనదికాదని బోధించవలెను- ఇప్పటికంటె ఎక్కువమంది ప్రచారకులు లభించవలెను-

## ఇంగ్లీషు మాటలు ఉపయోగించకుండుటకై శపథము

### ఉస్మానియా విద్యాపీఠ విద్యార్థుల యెదుట మెహిదీయార్జంగుగారి ఉపన్యాసము

ఉస్మానియా విశ్వవిద్యాపీఠపు కళాశాలలు ౨౧ఆమర్దాదునాడు తెరువబడెను. వైసుఛాన్సలరగు నవాబ్ మెహిదియార్ జంగుబహదరు గారాసందర్భమున విద్యార్థులకు ఉర్దుభాషలో హితోపదేశమొనర్చుచు, పరీక్షలందుత్తీర్ణులగుటయే తమయాదర్శముగ పరిగణింపరాదనియు విజ్ఞానార్జనమునే తమపరిమావధిగ నిడుకొని విజ్ఞానార్జనకు గడంగవలెననియు బోధించిరి. విజ్ఞానార్జనకు,విద్యార్థిదశవంటికాలము తిరిగి మిగతకాలమునందెన్నడును లభింపదనియు, కావున నీయవకాశమును ప్రతివారును సద్వినియోగమొనర్చుకొనవలెననియు నుడివిరి.

తాముఈసారి ఉర్దుభాషయందే ఉపన్యసించుటకును ఇదివరకురెండుపర్యాయములు ఉపన్యసించియుండుటకును వానికారణముల దెలుపుచు, నిజాముసంస్థానప్రజలు పాశ్చాత్యవిద్యలను భాషలనభ్యసించుట చాల అవసరమనియు, దాని ప్రాధాన్యతను దెలుపుటకుగాను తామాంగ్లమున ప్రసంగించియుంటిమనిరి.

ఇక ఈసారి ఉర్దులో ఉపన్యసించుటనుగూర్చి ప్రసంగించుచు ఇట్లుచెప్పిరి. "మనకు ఉర్దూలో ప్రతివిషయమునుకూడ గ్రహించుటకు అవకాశమున్నది. మనకుమనభాషలో శాస్త్రములను గ్రహించుటకుగల అవకాశములనుగూర్చి అతిశయోక్తులను చెప్పజాలము. ఈస్వభాషలో విషయముగ్రహించు పద్ధతివలన విషయములను లఘుముగబోధయగుటయేగాక భాషాభివృద్ధికూడ జరుగును. మనహిందూస్థానీభాషను ఈదేశములో గల కోట్లమంది అర్థముచేసికొనుచు మాట్లాడుచున్నారు. ఈభాషాసేవ కేవలము హైదరాబాదురాష్ట్రసేవయేగాక యావద్భారతదేశసేవ యగును. నేనుఈదినమునుండి ఇంగ్లీషుభాషను ఉపయోగించకుండుటకై నేను ప్రమాణము చేయుచున్నాను.''

ఆంగ్లభాషను నేర్పుటకుగాను ఇతరప్రాంతములనుండి ఇద్దరాంగ్లభాషాపండితులు నియమింపబడిరి వీరిలోఒకరు మదరాసువారు, మరియొకరు ఉత్తరహిందూస్థానీవారు, ముల్కీలనే ఉద్యోగములకు నియమించుట ప్రభుత్వముయొక్క విధానముకాని, ఎక్కువసమర్థులగువారు లభించనప్పుడితరప్రాంతముల నుండికూడ నియమించుచుందురు. వారితో సమానసామర్థ్యముగల వారీసంస్థానమున లభించనప్పుడే ఇటులజరుగును.

ఆవిధముగ నియమింపబడిన బయటివారలు భారతదేశమున గలకోట్లప్రజలచే నుపయోగింపబడునట్టి, అరబ్బీయున్నగు ఇతరభాషాపదముల కలిసియున్న స్వచ్ఛమగు ఉర్దూభాషను నేర్చుకొనుట కమూల్యమగునవకాశము లభించును.

హైదరాబాదుసంస్థానమున స్త్రీవిద్యాప్రచారమునుగురించి చెప్పుచు, ఈవిషయమున నిటీవలజరిగిన పరీక్షలందొకయువతి శారీరశాస్త్రమునందు పట్టపరీక్షలో ప్రథమురాలుగా నుత్తీర్ణురాలయ్యెను. మరియొకయువతి ఇంటర్మీడియేటుపరీక్షయందు ప్రథమతరగతిలో నుత్తీర్ణతనందెను ఇదిచాలగర్వింపదగిన విషయమనిరి, ఉపన్యాసము ముగించుచు ఉస్మానియావిశ్వవిద్యాలయస్థాపకులగు రైట్ ఆనరబిల్ సర్ అక్బర్ హైదరిగారిని అమ్ముఖర్జు విశ్వవిద్యాలయమువారిచే డాక్టరు బిరుదముతో సన్మానింపబడినందులకు అభినందించిరి.



## ౧ హైకోర్టువరకుపోయిన భ్రూణహత్య అభియోగము

పార్వతియను వితంతువు తనఅల్లుడగు ఈశ్వర్ జీతో కలిసి ఒకబిడ్డనుకన్నట్లును, ఆబిడ్డను ఆమె తన సోదరీపుత్రికల సహాయముతో సజీవముగ పూడ్చిపెట్టినట్లును, అందుచే ఆబిడ్డ చచ్చినట్లును ఒకఅభియోగమును పోలీసువారు ఔరంగాబాదుజిల్లా ఆదనపు సెషనజడ్జిగారి విచారణకు బెట్టగా, చాలినంతసాక్ష్యము లేదను కారణముతో న్యాయాధికారి నేరస్థురాలిని విడుదలచేసెను. పోలీసులు తృప్తిపొందక హైకోర్టులో మురాఫాచేయగా, అక్కడి ప్రధానన్యాయాధిపతులగు నవాబు జీవజ్ యార్జంగుబహాదరుగారును, న్యాయాధిపతియగు మీర్ అలంఅలీఖాన్ గారును మురాఫాత్రోసిచేసిరి.

## సికింద్రాబాదుకొట్లాటకేసు పరిష్కారము

సికింద్రాబాదులో గతసంవత్సరము జరిగిన ప్రచండమైనకొట్లాటలలో ఫకీరాఅనువతడు ఇస్మాయిల్ అనువానిని చంపుటలో పాల్గొనెను నేరము చేసినట్లు పోలీసువారలు అభియోగముతే(గా) దానిని సెషన్సు న్యాయస్థానమువారు విచారించి అతనికి మరణదండన విధించినసంగతి అందరికిని తెలిసినదే. దానిపై రెసిడెంటుకోర్టు మురాఫాలో ఆదేశిక్షు ఖాయమయ్యెను. దయదలచవలసినదిగా ఫకీరా రెసిడెంటుగారిని ప్రార్థించగా, ౧౦ ఏండ్ల కఠినఖైదుకుశిక్షను తగ్గించిరి. దానిపై ప్రివీకౌన్సిలుకు అప్పీలుచేయబడెను. ప్రివీకౌన్సిలువారు కేసును ఖానూను క్రమప్రకారము మరల విచారించవలసినదని అజ్ఞయిచ్చిరి. రెసిడెంటుకోర్టులో ఒకన్యాయాధిపతి సెషనుకోర్టు విధించినశిక్షను మురాఫాలో ఖాయపరచవీలు లేదని కౌన్సిలువారుతలచిరి. కొంటి రెసిడెంటుకోర్టువారితీర్పు చెల్లదనిరి. మరల విచారణలో ఫకీరా నేరస్థుడని తేలుచో, శిక్ష ఇదివరకు విధించబడిన ౧౦ ఏండ్లకఠినఖైదుకంటె ఎక్కువ తేకుండెనని[illegible] వెలుపలికి రాదనిరి. దానిపై కేసు మరల గతగురువారము రెసిడెంటుగారికోర్టులో రెసిడెంటు అగు కొల్ సి. హెచ్. గిడ్నీ, మరియు అడిషనల్ జడ్జియగు బార్టర్ గార్లయెదుట విచారణకు వచ్చెను. పూర్వము మదరాసు అడ్వొకేటు జనరలుగనుండిన టి. ఆర్. వెంకటరామశాస్త్రియార్ గారు. నిందితునితరపున వాదించుటకు వచ్చిరి.

వెంకట్రామశాస్త్రిగారు వాదించుచు కేసు కంతయు ప్రాసెక్యూషన్ వారి ౧౮ వ సాక్షి చెప్పినదొక్కటే ఆధారమనియు, సెషనుజడ్జిగారే ఆసాక్ష్యములో కొంతకల్పితమని త్రోసివేసియుండిరనియు, వైద్యపరీక్షలోకూడ ఇస్మాయిలుకుతగిలినదిసామాన్యమైనగాయమేనని చెప్పబడెననియు, ఉపయోగించబడిన ఆయుధము నిందితునిగుడ్డలు పరీక్షించబడలేదనియు వాదించిరి. ప్రాసెక్యూటరుగారు విచారణచేసిన జడ్జి అన్నివిషయములును సరిగానే విచారించెననిరి.

తీర్పు శనివారము 3 జులైనాడు ఏర్పడెను. ఇండియన్ పినల్ కోడు ౧౮ వ సెక్షనుక్రింద ౫ ఏండ్ల కఠినఖైదున్ను, కొట్లాటలో ప్రాముఖ్యముగ పాల్గొన్నందుకు ౭ ఏండ్ల కఠినఖైదును విధించబడెను, రెండుశిక్షలును ఒక్కసారిగ అమలుజరుగవలెనని చెప్పబడెను.

నిందితునివకీలుగారు చెప్పినవాదమును ఖండించుచు, అట్టిపరిస్థితులలో సాక్ష్యము తక్కువగానుండుట ఆశ్చర్యముకాదనిరి. ఇద్దరు హిందువులు నిరపరాధియైన హిందువుపై తప్పుడుసాక్ష్యమిచ్చుట అసంభవమనిరి. నిందితుని చేతిలో ఒకకఱ్ఱయుండెననియు దానిని ప్రాణాంతకమగు ఆయుధమని చెప్పవచ్చుననియు నిందితుడు మరికొందరితోచేరి ఇస్మాయిలుమ గాయపరచు నుద్దేశ్యముగల ఆక్రమసంఘములో చేరినట్లు ఎంచబడవచ్చునుగనుక సెక్షను ౩౦౪ మరియు సెక్షను ౧౪౯ ల క్రింద నేరమునుగా మార్చి పరిగణించుట న్యాయమేయగునని కోర్టువారుసమాధానమొసంగిరి.

## భార్యమీదిఅనుమానముచే చిత్రవధలు

ఉస్మానాబాదుజిల్లాలోని తుంగిగ్రామములో పోలీసులు ఒకచిత్రవధ వ్యవహారమునుగూర్చి విచారించుచున్నారు. అక్కడ ఒక నూసెగిర్ని వ్యాపారి భార్యశీలముపై అనుమానము కలిగి శిక్షించబోగా అతనితల్లి అడ్డువచ్చుటచే ఆమెను మైడనులిమి చంపెనట. తర్వాత మేనమామగారిని నరికిచంపెను. ఇట్లే తనబిడ్డను ఇంకొకబంధువును చంపువంతలో భార్యతప్పించుకొని ఎటో పారిపోయెను. తర్వాత భార్యకై ఎంతవెదకినను చిక్కకపోగా అతడు బావిలోదూకి చచ్చెనట.

## సికింద్రాబాదు చందాదారులకు మనవి

మాసౌకర్యార్థమై ౧౯౩౭ జులైనెల నుండి, ఇ. వర్సింలు న్యూస్ ఏజంటు, ౧౦౫ జేమ్సుస్ట్రీటు సికింద్రాబాదుగారిని మాఏజంటుగా నియమించియున్నాము. ఇకమీదటనుండివారిద్వారానే తమకు పత్రికలువచ్చుచుండును. వీరివద్ద ఎక్ట్రాకాపీలుకూడా దొరకును. చందాదారులుకోరువారు వీరికి చందాచెల్లించి రశీదు పొందవచ్చును. మాచే ప్రచురింపబడిన గ్రంథములుకూడా లభించును.

మేనేజరు
గోలకొండపత్రిక.

## ఉంజలిఉత్సవము

రావుబహాదరు ముస్త్యాల వెంకటకృష్ణయ్యగారి మనుమరాలి వివాహసందర్భములో పోయినగురువారమునాటిరాత్రి ఉంజలిఉత్సవము జరిగెను. ముస్త్యాలవెంకయ్యగారును, శంకరయ్యగారును అతిథులకు స్వాగతమొసగుచుండిరి. భవనము రంగురంగుల విద్యుద్దీపములతో నలంకరింపబడియుండెను. వధువు మనోహరమ్మ, వరుడు శంకరయ్యతోను. వధువు లీలావతమ్మ వరుడు రాజేశ్వరరావుతోను ఉంజలిలో అమూల్యవస్త్రాభరణభూషితులై కూర్చుండిరి. పాటకచ్చేరీ మున్నగు కార్యక్రమానంతరము వచ్చినవారలు అతిథులనాశీర్వదించిరి. రావుసాహెబు సి. కె. మర్యాసులు, ఖాన్ సాహెబు అబ్దుల్ కరీం బాబుఖాన్, ప్రొఫెసరు టి. వీరభద్రుడు, ఏ. జె. సీరాస్వామి. హబీబుల్లా మున్నగువారలు వచ్చియుండిరి.



హిజ్ మాస్టర్సు వాయిస్ గ్రామఫోనులలో

### తగ్గింపు ధరలు




| పేరు | మాడల్ నంబరు | మొదటివెల | తగ్గింపువెల |
|---|---|---|---|
| పోర్టబుల్ | ౧౨౨ | రు ౧౦౦ లు | రు ౭౦ లు |
| రంగులలోచర్మముకప్పగలది ,, | | ,, ౧౧౦ ,, | ,, ౮౦ ,, |
| మంచిఫేషనులో | ,, | ,, ౧౧౦ ,, | ,, ౧౦౦ ,, |

అన్ని రకముల తెలుగుగ్రామఫోను రికార్డులు మావద్దదొరకును.
స్త్రీలువచ్చి చూచుటకు ప్రత్యేకమగు ఏర్పాటుగలదు.

బి. జి. చిమలి
జాంబాగు, హైదరాబాదు దక్కన్.




# గోలకొండ పత్రిక

ఈశ్వరనామ సంII ర జ్యేష్ఠ బII 3౦

గురువారము


## విద్యామంత్రిగారి ఆదర్శములు

ఒకసారి ఉస్మానియా విద్యాపీఠ విద్యార్థుల కుపన్యసించుచు నవ్వాబు మెహిదీయార్జంగు బహద్దరు గారు సెలవిచ్చినకొన్ని అమూల్యవాక్యములు రాష్ట్రమందేకాక బ్రిటిషు ఇండియాయందును దేశాభివృద్ధికై పాటుపడువారందరును ముఖ్యముగా యువకులును, విద్యార్థులును ఆదర్శముగానుంచుకొనదగినవి.

"జననీజన్మభూమిశ్చ
స్వర్గాదపి గరీయసీ"

అనునార్యోక్తి యీనాటిది కాదు కాని యీయార్యోక్తి ఎన్నడో భారతీయులు మరచిపోయినందున వారు దరిద్రులైపోయిరి. పాశ్చాత్య దేశములో ప్రతిదేశమువారును దేశభక్తిని ప్రతివానికి ఉగ్గుపాలతోనే బోధించుచుందురు. సర్ వాల్టర్ రాలేగారు తమ "ఆదర్శ యుద్ధము" (War of ideals) అనుగ్రంథములో నిట్లువ్రాసియున్నారు. అమెరికాకు వలసపోయిన నొక ఆంగ్లస్త్రీ తన గదిలోనొక ఆట్టపై నిత్యస్మరణార్థమొక వాక్యమువ్రాసికొని యుంచియుండెనట. అదేమన,

"Right or wrong My country"
"తప్పో ఒప్పో
నా దేశమే
నాకు ప్రీతి"

కానిమనము "మా దేశము ఒప్పిదమైనమార్గముననే నడచుగాత" అని సత్పథమునే కాంక్షింతముగాక!

మన నవాబుగారు మొన్నటిసభలో ముల్కీలనుగురించి ముచ్చటించుచు నిట్లు సెలవిచ్చిరి.

"బయటివారిని కొందరిని ఉద్యోగములందు నియమించవలసి వచ్చినది మనవద్ద తగినవారు దొరకనప్పుడు కొంతకాలమువరకు బయటివారిని నియమించవలసివచ్చును."

ముల్కీలపై నవ్వాబుగారికి మంచి అభిమానమే యున్నదని విశదమగుచున్నది. కాని మన దురదృష్టమేమో అందరును మన నవాబుగారివలె అభిప్రాయములు కలవారు కాకపోవుటచే తనో యేమో ముల్కీలకు సరియగుస్థానములు దొరకకున్నవి. ముల్కీలలో సరియైనవారు దొరకరను నొక అపకీర్తి ముల్కీలపై నున్నది. ముల్కీలను మొదలు నియామకముచేసి పరీక్షించి తర్వాతవారు అనర్హులని నిర్ణయించిన అంగీకరింపవచ్చును. ఒకవేళ ఏప్రత్యేక శాఖకో సరియగువారు దొరకకుండిన ముల్కీలను సిద్ధముచేయించిన ౫ ఏండ్లలోపల అన్ని శాఖలకును ముల్కీలు దొరకుదురు. ఐదేండ్లలో సిద్ధముకాకున్న పదేండ్లలోనైనను అగుదురు. మనవద్ద ఎందరోవిద్యార్థులు—వారు సాధారణముగా బీదవారును దిక్కులేనివారును, కేవలముతమకష్టమే తమవిద్యయే, సిఫారసుగాకలవారై—ఉత్తమ దర్జాలలో ప్రతిసంవత్సరము ఉత్తీర్ణులగుచున్నారు. వీరినందరిని అవసరముండిన తగిన తావులందు తరిబీయతుకేయించి ఉద్యోగములిచ్చిన తగిన ముల్కీలులేక విదేశీ ముల్కీలను నియోగింపవలసి వచ్చెనను అపవాదమునకు తావే యుండదు. ఎక్కడచూచినను ముల్కీలనుగురించి మంచి మంచి వాక్యానుభూతికే మియు కొదువలేదు, కాని క్రియారూపకముగా మ.ఘు.వ. నిజాంప్రభువులుంగారి ఆజ్ఞలను దృష్టిలోనుంచుకొని యాచరించుకొనుట అధికారుల ప్రప్రథమ విధియై యున్నది.

నవాబు మెహిదియారుజంగు బహాదరుగారు సెలవిచ్చిన రెండవ విషయమింకను విలువగలది. అదిమాతృభాషాభిమానమును గురించినది. వారికి తమ మాతృభాషయగు ఉర్దూపై యెంతగాఢాభిమానముకలదో యీ క్రింది వాక్యములే సాక్ష్యమిచ్చుచున్నవి.

"నేను గతసంవత్సరము ఇంగ్లీషులో నుపన్యసించియుంటిని. ఎందుకనగా ఇంకనూ మనము పడమటివారినుండి కొంచెము, గొప్ప నేర్చుకొనవలసి యున్నది మనకు ఉర్దూలో ప్రతి విషయమునుగూడ సంపాదించుటకు అవకాశమున్నది."

ఉర్దూభాష ఏప్రకారముగా దైనందినాభివృద్ధిగాంచుచు ఒక మహచ్ఛక్తిని సంపాదించుకొనుచున్నదో పై వాక్యములవలన నూహింపగలము. నవాబుగారు మరియు ఇట్లు సెలవిచ్చిరి.

"మనము మాతృభాషలోనే శాస్త్రములనేర్చుకొనుటకు ఏయవకాశములున్నవో వానినిగురించి యెంత స్తుతించినను తక్కువే. ఈ విధానమువలన కేవలము విద్యా సంగ్రహణమందు సౌలభ్యముండుటయేకాక భాషాభివృద్ధియు కలుగుచున్నది. పైగా మనభాష యెట్టిదనగా—దానిని హిందూస్థానములో ౧౮ కోట్లమంది మాట్లాడుచున్నారు. అర్థముచేసుకొనుచున్నారు. ఈ భాషాసేవ కేవలము హైద్రాబాదు సేవకాదు. అది యావద్భారత దేశ సేవ."

ఈవాక్యములు వారినోటినుండియీ రీతిగా వెలువడుట సహజమే. మాకును ఉర్దూమాతృభాషయైయుండినచో మేమును ఇట్లే చెప్పియుందుము. కాదు ఇంతకు హెచ్చుస్థాయిలోనే ఉచ్చరించి యుందుము. ఒకవేళ ఉచ్చరించు నవకాశము లేకుండిన, ఏదియైనను రహబరెదక్కన్ పత్రికారీతిగా నుబ్బియుప్పొంగి యుల్లాస లక్ష్మీ పరీరంభణములో తన్మయులమై పోయియుందుము.

రహబరెదక్కన్ యొక్క ఆనందాతిరిక్తతయొక్క మచ్చును చూడుడు.

"నవాబుగారు ఈతడవఉర్దూలో మాట్లాడినందుకు మాకత్యంతానందము కలిగినది......వారు ప్రప్రథమమునందే "హాజరత్" అని యుచ్చరించినంతనే సభ్యుల హృదయములలో నొక విద్యుత్తరంగము దౌడుతీసినది."

అన్నిటికన్నమించిన విశేషమింకొకటికలదు. నవ్వాబుగారు హై. అ. సర్ అక్బర్ హైదరీగారికి తంతివార్త పంపవలసివచ్చినప్పుడు తాము ఇంగ్లీషు ఉచ్చరించకపోయిరి. ఏలననగా నవాబుగారే యిట్లుసెలవిచ్చినారు:

"ఈదినము నేను ఇంగ్లీషు మాటలు ఉపయోగించకుండుటకై శపథము చేసుకొన్నాను."

నవ్వాబుగారి ఉన్నతపదవిని బట్టి వారికొక్కదినమైనను ఇంగ్లీషుమాట ఒక్కటికూడ మాట్లాడకుండుటకై ఒట్టుపెట్టుకొనుటసామాన్యవిషయము కాదు. వీరివలన కేవలము ఉర్దూ మాతృభాషాజనులేకాక హిందూస్థానవాసులందరును నేర్చుకొనవలసిన గుణపాఠ మేమన, మనము మనమాతృభాషను బాగుగా అభ్యసింపవలెను. అంతేకాదు అభిమానించవలెను. పైగాపూజింపవలెను. మరియుభక్తితోపూజించిఅన్యభాషావ్యవహారము నుపరిత్యజించుటకై శపథమూనవలెను.

ఈరాష్ట్రములో అధిక సంఖ్యాకులుగానుండు ఆంధ్రులును, మరాఠీలును, కర్ణాటకులును నవాబుగారి మాతృభాషాభిమానమును గ్రామ గ్రామమందు తుదకు ఇంటింటను ప్రచారము చేయవలెను. నవాబుగారికి తమ మాతృభాషయెట్లో యితరులకును తమ తమ మాతృభాషలట్టివి. ప్రతిజాతియు తమ తమ మాతృభాషల నవాబుగారివలెనే గాఢముగాఆదరించి ప్రేమించి పూజించిన అందరిలో మొట్టమొదలానందించువారు మన నవాబుగారే యనుటలో సందేహ మావంతయునుండనేరదు. మన రాష్ట్రములో నించుమించు విద్యావంతులందరును తమతమ మాతృభాషలందాదరమును పూర్తిగా విడిచినారలు. నాయకులైనవారే పరస్పరము మాట్లాడుకొనునప్పుడు పరభాష మాట్లాడుట గౌరవమనుకొను కష్టకాలము ముంచుకొనివచ్చినది. అందులో ఆంధ్రులింకను అపచారము చేసినవారగుచున్నారు. ఆంధ్రులలో ముఖ్యశాఖలకుచెందినగోలకొండ వ్యాపారీలు, రెడ్డి దేశముఖులు, వెలమదొరలు, కొద్దిగా పరభాషాసంస్కారముపొందియు పొందకమునుపే తమ బంధువులతోను, మిత్రులతోను అన్యభాషలోనే వ్యవహరించుట చూచుచున్నాము. అట్టివారు మన నవాబు మెహదీయార్ జంగు బహాదరుగారి వాక్యములను పవిత్రవాక్యములుగా భావించి ఆదర్శముగా నుంచుకొని యికనైనను తమ వక్రీకృత దృక్పథమును సవరించుకొందురుగాకయని యుద్బోధించుచున్నాము.

## సంస్థాన వార్తలు

### బెంగుళూరులో ఊరేగింపులు, సభల నిషేధము

పండిత జవహరలాలు గారి అభిప్రాయము

బెంగుళూరు జులై_౨.

బెంగుళూరులో లైసెన్సులేకుండ సభలను ఊరేగింపులనుజరుపగూడదనుఅని సిటీ మేజస్ట్రేటు ఉత్తరువుచేసెనని నాకుతెలిసినది, అది వ్యక్తిస్వాతంత్ర్యమును భంగపరచుటయేయగును. కావునదీనినిగూర్చి మనముమన అసమ్మతిని స్పష్టముగా తెలుపవలెను-ఇపుడు దేశమునందంతటను ఇట్టిఉత్తరువులుచాలఅధికమైనవి- విఖ్యాతులనుచాలమందిని అరెస్టు చేయుచున్నారు. మీరు దీనినిగూర్చి అసమ్మతిని తెలుపుచు పత్రికలకువ్రాయవలెను. సివిలు లిబర్టీసుసంఘమువారికిగూడ వ్రాయవలెను-అని పండిత జవహరులాలు నెహ్రూగారు "బెంగుళూరుమాన్ ఆర్డినర్సు యూనియను" కార్యదర్శికి వ్రాసిరి.

### కాశ్మీరములో మత పరివర్తనను గూర్చి మనో వైషమ్యములు

రాహోరు: జులై_౨.

రాజకీయసభ ప్రచురణశాఖ కార్యదర్శి జమ్ము [కాశ్మీరము]నుండి ఈక్రింది తంతివార్త పంపిరి:

నిన్న కోర్టువెలుపలనున్న ఒకయువతిని కొందరు బలవంతముగా ఎక్కడికో ఎత్తుకొనిపోయిరి-హిందువులు లాఠీలతోవచ్చిరి. ఈయువతి పేరురన్మాతుబీబీ, ఈమెను ఈనుధ్యనే మహమ్మదీయమతములోనికిచేర్చుకొనిరి ఈసందర్భమున కేసువిచారణజరుగుచున్నది. ఈరీతిగాజరుగుట తమకుఅవమానమని మహమ్మదీయులు భావించిరి. శాంతిముగ్రహింపవలసినదని చౌదరిగులాఅబాస్ గారిబోటి ప్రముఖులు. కొందరు మహమ్మదీయులకు బహిరంగసభలో నచ్చజెప్పిరి మహమ్మదీయులనుతప్పుత్రోవకీడ్చుటకు కుట్ర జరుగుచున్నదని అనుమానించుటకుఅవకాశమున్నదనిగూడ పీరుచెప్పిరి-ఇట్టిపరిస్థితులలో రాజకీయవ్యవహారములందు మహమ్మదీయుల బలమునుతగ్గించుపనులనుచేయవద్దని ముస్లిం ప్రముఖులు సభవారికి విన్నవించిరి.

### సంస్థాన పౌరులపై బొంబాయి ప్రభుత్వపు నిషేధపుటుత్తరువు తొలగుట

భారతదేశపు వివిధ సంస్థానములకు చెందిన ౧౫ మంది బొంబాయిరాష్ట్రమునకురాగా వారి రాజకీయచర్యలనుబట్టి, ౧౯౩౭ సంవత్సరపు రెగ్యులేషన్ ప్రకారము వారిపైగావించిననిషేధపుటుత్తరువును రద్దుపరచుచు బొంబాయి ప్రభుత్వమువారు మరొక ఉత్తరువును గావించిరి.

ఏనాడు నవాబుగారు ఇంగ్లీషు నుచ్చరింపనిరీతిగా ఒట్టుపెట్టుకొనిరో ఆదినము మనరాష్ట్రభాషా చరిత్రలో పవిత్రదినమైనది. నవాబుగారిని అభినందించుటకై ప్రతి సంస్థానమందును ప్రజలు సభలు చేయుట అత్యంతసంభావ్యమనియు ప్రథమమున నగరమందే యిట్టిసన్మానసభను గావించుట యుక్తమనియు మేము ప్రజానాయకులందరికిని సూచించుచున్నాము.

# అరబ్బీయూదులకు పాలెస్టయిను విభాగము

బ్రిటిషువారి ఆలోచన

పాలెస్టయినులో అరబ్బులకును, యూదులకును గలహక్కులను సమన్వయమొనర్చుటకును, బ్రిటిషువారి హక్కులను కాపాడుటకును రాయలుకమీషనువారు కొన్ని ముఖ్యసూచనలు గావించిరని తెలియుచున్నది. కమీషనువారి సూచనల ననుసరించియే పాలెస్టయిను సమస్యను పరిష్కరించుట ఉచితమని బ్రిటిషుప్రభుత్వము వారు అభిప్రాయపడుచున్నట్లు తెలియుచున్నది.

పాలెస్టయిను రాజ్యమును రెండుభాగములుగవిభజించి ఒకభాగమును యూదులకును మరియొకభాగము అరబ్బులకును ఇవ్వవలయునని పాలెస్టయిను రాయలుకమిషనువారు తమనివేదికయందు సూచించినట్లు కొన్నివదంతులు ప్రబలినవి. ఈసూచనను ఆక్షేపించుటకై అమెరికా యూదుల సంఘమువారు కొంతమందిని బ్రిటిషుప్రభుత్వమువారివద్దకు రాయబారముగ పంపుటకు తీర్మానించుకొనిరి.

## అంతర్జాతీయ వాణిజ్యార్థిక సహకారము

వాషింగుటను; జూన్ ౨౯:-

అంతర్జాతీయ వాణిజ్యార్థిక సమస్యలను, ఆయుధబల నిర్మాణసమస్యను పరిష్కరించుటకై అమెరికా ప్రభుత్వమువారు ఐరోపాఖండపు రాజ్యములతోకలసి పనిచేయవలయునని సూచించుచు, ఈవిషయమై రూజ్‌వెల్టుగారి అంగీకారము పడయుటకై బ్రిటను, ఫ్రాన్సు, బెల్జియం ప్రభుత్వములు బెల్జియం ప్రధానమంత్రి వాన్‌జలాండుగారిని తమ ప్రతినిధిగ నియమించిరి. ఈమూడు రాజ్యములపక్షమున వాన్‌జలాండుగారు అమెరికాకువెళ్లి ఈవిషయమై రూజ్‌వెల్టుగారితో సంప్రదించిరి. ఈసంభాషణలు తృప్తికరమగువిధమున కొనసాగినవని తెలియుచున్నది.

అంతర్జాతీయ వాణిజ్యార్థికసమస్యలను పరిష్కరించుటకును, ఆయుధబలనిర్మాణ సమస్యను పరిష్కరించుటకును అమెరికా ప్రభుత్వమువారు ఐరోపాఖండపు రాజ్యములతోకలసి పనిచేయసిద్ధముగ నున్నట్లు రూజ్‌వెల్టువాన్‌జీలాండుగార్ల సంతకములతో నేడొకప్రకటన గావింపబడినది.

## మద్రాసుప్రధానమంత్రికి చల్లపల్లి రాజాగారి విన్నపము

ఉదకమండలము జూలై ౨.

చల్లపల్లిరాజాగారి నాయకత్వము క్రింద కృష్ణాజిల్లానుండి వచ్చిన ప్రతినిధులు నేటిమధ్యాహ్నము ప్రధానమంత్రిని, నిర్మాణశాఖామంత్రిని దర్శించిరి-కృష్ణాడెల్టాలో కృష్ణాతూర్పుగట్టుకాలువక్రిందను, క్యాంబెల్ కాలువక్రిందనుఉన్న బీడుభూములను పంటనేలలుగ మార్చినందులకు ఎకరా ఒకటికి రూ ౨౫లవంతున విధించుచార్జి రద్దుచేయవలసినదనియు, ఎకరాకు రూ ౭-౮-౦ వంతునఉన్న నీటిపన్నును రూ ౫లుగ చేయవలెననియు,మంత్రులనుకోరిరి. మెట్టభూములను మాగాణిక్రిందికి దెచ్చుటకు రైతులకుచాల మూలధనము ఖర్చగుచున్నదనియు, దానికితోడు పోరంబోకు నేలలను పంటభూములుగ చేసినందులకు ఎకరాకు యిరువదియైదురూపాయలనువిధించుట అక్రమమేగాకుండ రైతులకుదుర్భరతను విన్నవించుకొనిరి. మంత్రులు ఈవిషయమునతమకు శక్తియున్నంతవరకు తోడ్పడెదమని వాగ్దానమునిచ్చిరి.

[ఆంధ్రి]

## భారతదేశమున పారిశ్రామిక పరిశోధన

భారతప్రభుత్వ పారిశ్రామిక పరిశోధనసంస్థవారి వార్షికనివేదికలో వెనస్లు తయారుచేయుటకు ఉపయోగించు వంట్రమునుపట్టివిపరిశుభ్రము చేయుటకు, నూనెగింజలను పండించుటకు, వినియోగించుటకు అనుకూలించు పరిశోధనవిధానములు తెలుపబడినవి.

౧౯౩౫సంవత్సరములో జరిగిన పారిశ్రామికపరిశోధనసంస్థవారి ప్రథమసమావేశమున వృత్తిదారుల నూనెల, సబ్బుల ఉపసంఘమును ఏర్పాటుచేయవలెనని శిఫారసు చేసిరి. ఈఉపసంఘమువారి శిఫార్సులు భారతదేశములోనిపరిశోధనసంస్థలకు పంపబడినవి. సామ్రాజ్యవ్యవసాయ పరిశోధనసంస్థతో సహకారమువలనకలిగిన ఫలితములుగూడ నివేదికలో విశదపరచబడినవి.

గాజుపరిశ్రమనుగూర్చి నివేదికలో ఒకప్రకరణముగలదు క్రొత్తరకపుకొలిమినికనిపెట్టిరి. అందుమూలమున నిప్పుకగుచున్నఖర్చు తగ్గుటేకాకుండా ఎక్కువఉష్ణమువచ్చును. ఈక్రొత్తరకముకొలిమిని ఫిరోజాబాదులో అమర్చిరి-గాజులపరిశ్రమకు తోడ్పడు సన్నాహము చేయుచున్నారు-గాజుపరిశ్రమకు అనుకూలించు ముడిపదార్థములను కూడబెట్టిరి.

"గవర్నమెంటుటెస్టుహౌస్"లో పరిశోధనశాఖవారు రంగులు, డ్రైసెల్సు, విద్యుచ్ఛక్తి దీపములు, పన్నరకపుయంత్రములు మున్నగునవి తయారుచేయుటకుయత్నించిరి. రంగులుచాలాకాలమువరకు చెడిపోకుండా ఉండునట్లుల చేయుటకుఅనుకూలించుక్రొత్తయంత్రమును అమర్చిరి. భారతదేశమునదొరకుముడివస్తువులనుండి రంగులనుతయారుచేయుటకు వీలగునో కాదో పరీక్షించుచున్నారు. ఇనుములకుముడివస్తువులను ఒకటిగాచేర్చువిధానమును గూర్చి పరిశోధన చేయుచున్నారు.

కొన్ని రాష్ట్రములలోని విద్యుచ్ఛక్తిదీపముల ఫ్యాక్టరీలలోనిసరకును అప్పుడప్పుడు తనిఖీచేయుచున్నారు-కలకత్తాలోని ఒక విద్యుచ్ఛక్తి ఫ్యాక్టరీకోరినసహాయమును పరిశోధనశాఖవారుచేసిరి. వృత్తినూనెలను, యంత్రములను ఉపయోగించుటనుగూర్చి పరిశోధనచేయుశాఖవారు పట్టుదలతో పరిశోధన సాగించుచున్నారు-క్వెట్టాజిల్లానుండి వివిధరకముల మట్టిని తెప్పించి. ఇటుకలను చేయుచున్నారు-ఈమట్టిలోతగినంత "ఐరన్‌కాంపౌండు" లేనందున మామూలు ఇటుకవర్ణమువచ్చుటలేదు.

పారిశ్రామిక సంస్థవారి గ్రంథాలయమున ౩౫౦౦౦గ్రంథములుగలవు. పరిశ్రమలకుఅనుకూలించువిశేషములను తెలుసుకొనగోరువారి సంఖ్య క్రమక్రమముగా ఎక్కువగుచున్నది.

రాబోవుసెప్టంబరులో చికాగోయందు జరుగు ౨వ అంతర్జాతీయ రేడియాలజీ కాంగ్రెసుకు భారతదేశ ప్రతినిధిగ డా॥ పి. రామారావుగారు హాజరయ్యెదరు-వీరుజూలై౫వతేదీని మదరాసునుండికొలంబోకువెళ్లి అక్కడనుండి "రాజపుటానా" స్టీమరులో జపాను చీనా మొదలగుదేశములకు వెళ్లెదరు. వీరురాచపుండువిషయమునుగూర్చి ప్రత్యేకతెలిసికొనుటకై ప్రపంచమునంతటను తిరిగి పర్యటనముజేసి యూరోపుమీదుగా అక్టోబరుఆఖరులో భారతదేశమునకు తిరిగివచ్చెదరు.

[ఆంధ్ర]

## రాజకీయనేరములు

కటకమండల కాంగ్రెసుసంఘమునకును ఉత్కళరాష్ట్ర కర్షకసంఘమునకును అధ్యక్షుడగు ప్రాణకృష్ణపధియారీగారిపై తేబడినరాజద్రోహపుకేసులో ప్రాణకృష్ణగారు నేరముచేయలేదని అసెసరులు తెలిపినను అసిస్టెంటుసెషన్సుజడ్జి అసెసరులనిర్ణయమును తిరస్కరించి ప్రాణకృష్ణగారికి ఆరునెలలు విడిశైదును, నూరురూపాయలు జుర్మానాను, అదిచెల్లించనిచో మరిరెండునెలలు శైదునువిధించెను-



## ఆనందభవనములో కాంగ్రెసునాయకుల సంభాషణలు

ఆనందభవనములో ౨౯ జూన్ నాడంతయు ఆచార్య నరేంద్రదేవు, డాక్టరు సయ్యదుమహమ్మదు, ప్రొఫెసర్ కె-టి-షాగార్లు పండితజవహరలాలు నెహ్రూగారితో కాలక్షేపముచేసిరి- "నేషనలు పబ్లికేషను సొసైటీని" స్థాపించిరనియు, డైరెక్టర్లలో పండితనెహ్రూగారు ఉన్నారనియు, సొసైటీకార్యనిర్వాహణము సంబంధమున పండితునితో సంప్రదించుటకు తాను వచ్చియుంటిననియు ప్రొఫెసరు కె-టి- షాగారు చెప్పిరి-

## బొంబాయిలో నూతనరాజ్యాంగాభిమానుల సమావేశము

నూతనసంస్కరణ విధానముపట్ల అభిమానముగల ప్రముఖులతోకూడిన సమావేశమొకటి పూనాలో జూలై ౧౦,౧౧ తేదులందు జరుగునని బొంబాయిప్రధానమంత్రి ప్రకటనగావించెను- సమావేశమునకు పురపాలకసంఘసభ్యులను, స్థానికసంస్థలసభ్యులను, పలుకుబడిగల వివిధరాజకీయపక్ష నాయకులను ఆహ్వానించిరి- కార్మిక పారిశ్రామిక సంఘములవారికిగూడ ఆహ్వానములనుపంపిరి- ప్రజలకు ఉపయోగించు కార్యక్రమమును తయారుచేయుటకు ప్రజలసహకారము, సహాయముబడయుటకు ఈసమావేశము అనుకూలించునని ప్రధానమంత్రిఉద్దేశము.

## మదరాసుబాలభటసంస్థను బేడన్‌పవల్ గారి సంస్థనుండి తొలగించుట

బాలభటోద్యమమునకు నాయకుడగు బేడన్ పవల్ గారు రెండుమూడు మాసముల క్రింద భారతదేశీయులను గూర్చి గుణముగునదిలేదని ఎటుల నోరుజారి అనిరో గాని దానిపై దేశమంతటను అందోళనలేచెను. ప్రతినాయకుడును, ప్రతివారును ప్రతిసంస్థయు బేడెనుపవల్ గారిని దూషించసాగెను. ఈ అందోళన సంగతి బేడను పవల్ గారికి తెలియరాగా వారు తామన్నదితప్పుగ్రహము చేసికొనబడుచున్నదనియు, గుణము లేకుండుట ఒక్క భారతదేశముయొక్క లోపము మాత్రమే గాక, అన్ని దేశములయందును గలదనియు, భారతదేశీయులలోను ఆలోపము న్నదికనుక అదిసవరించుకొనుట అవసరమని మాత్రమే తాను చెప్పియుంటిననియు బేడన్ పవల్ గారు సమాధానమిచ్చిరి. కాని ఉద్రేకములో నున్న భారతీయాభిప్రాయము నిదిసంతృప్తిపరచలేదు. అన్ని దేశములలో ఈలోపమున్నప్పుడు భారతీయులను ప్రత్యేకముగ నెందుకు అవిధము న పేర్కొనవలసి వచ్చెనని భారతీయులలో అందోళన ప్రబలమయ్యెను. కొందరు భారతదేశములో బాలభటోద్యమమును బేడన్ పవల్ గారి సంస్థనుండి తొలగించి పండిత మదనమోహన మాళవ్యాగారి సేవాసమితి బాలభటసంఘముతో చేర్చవలసినదని కోపముతో సూచించిరి. తుదకీ సూచనను అనుసరించి మదరాసు కార్పొరేషనువారు మొన్న జూలై 3వ తేదినాటి సాయంకాలమునసభలో బాలభటసంఘమును దక్షిణభారత బాలభట కేంద్రసంఘమునుండి విడదీసి పండిత మదనమోహన మాలవ్యాగారిచే స్థాపింపబడిన సేవాసమితి బాలభటసంఘముతో చేర్చుటకు తీర్మానించుకొనిరి. ఈ తీర్మానమునుఅన్ని తెగలవారును సమానముగ బలపరచిరి. తుదకు ౨౮ ఓట్లు తీర్మానమున కనుకూలముగనుండ, ఒక్క ఓటుమాత్రమే ప్రతికూలమయ్యెను.

—

## శ్రీ॥ శే॥ సర్. యస్. పోచకన్వాలాగారు

—

గుమాస్తానౌకరితో ప్రారంభించి సెంట్రల్ బ్యాంకు మూలస్థాపకులై ఇప్పుడు మేనేజింగుడైరెక్టరుగనున్నసర్ సొరాబ్జిపోచకన్వాలాగారు కొంతకాలముగా జబ్బుపడియుండి ౭ జులైనాడు. సాయంకాలము ౭ గం. ౨౦ ని. వేళ ప్రాణమువిడచిరి. వీరు ౧౮౮౧ ఆగష్టు ౧౨ తేదినాడు జన్మించిరి. బొంబాయిలో న్యూహైస్కూలులోను, తర్వాత సెయింట్ గ్జేవియర్ కాలేజిలోను చదువుపూర్తిచేసికొని "చార్టర్డుబ్యాంక్ ఆఫ్ ఇండియా, ఆస్ట్రేలియా, అండ్ చైనా"లో చేరి ఏడేండ్లుపనిచేసిరి.

తర్వాత "బ్యాంక్ ఆఫ్ ఇండియా"లో ౫ ఏండ్లుపనిచేసి "సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా"నుస్థాపించిరి. వారికి "అసోసియేషన్ ఆఫ్ ది ఇన్స్టిట్యూట్ ఆఫ్ బ్యాంకర్సు" (లండన్)వారి సర్టిఫికేటు ౧౯౧౦లో దొరకెను. ౧౯౨౧లో వారు ఇండియాప్రభుత్వముచే "గవర్నుమెంట్ సెక్యూరిటీస్ రిహాబిలిటేషన్ కమిటీ"లో సభ్యులుగనియోగించబడిరి. ౧౯౩౦లో వారు "సెంట్రల్ బ్యాంకింగ్ కమిషను"యొక్క అధ్యక్షులుగాచేయబడిరి. మరియు ఆ దేసంవత్సరమందు వారికి "సర్"బిరుదమువచ్చెను. వారు భారతదేశములో బ్యాంకింగు వ్యాపారమునకు మూలపురుషుడుగ నెంచబడెను. ౧౯౩౬వ సంవత్సరమువారు లండను "సెంట్రల్ యక్స్చేంజి"ని స్థాపించిరి. అందునుండి తిరిగివచ్చినతర్వాత కొద్దికాలమునకేవారు జబ్బుపడి తుదకు భౌతికశరీరమును వీడవలసివచ్చెను.

—

## కార్మికులసమస్యలు

—

కలకత్తా; జూలై 3౦:—

ష్టాంపర్డు జనపనారమిల్లులోని మాలుపడు కుపనివాండ్రు తమవేతనముల నెక్కువచేయవలెననియు, పనివాండ్రసంఖ్యను హెచ్చింపవలెననియుకోరి ౨౮ జూలైనుండి పనికిరాలేదు. అంతట మిల్లును మూసివేసిరి. 3000 మందిపనివాండ్రు పనిలేకుండా ఉండిరి.

* * *

కలకత్తా; జూలై ౨౯:—

బడ్జిబడ్జిప్రాంతమునయున్న ఒక జనపనారమిల్లును, ముందుగా తెలియబఱచకుండా, పనివాండ్రుతమ అసమ్మతిని వెల్లడించుచుండినను లక్ష్యపెట్టక మిల్లుఅధికారులు ఒక వారముమూసివేసిరి. ఆవారమునకుతమకు వేతనములీయకుండిరి కష్టమని పనివాండ్రు మేనేజరుకువిన్నవించిరి. పనివాండ్రు బహిరంగసభలో తమఅసమ్మతినివెల్లడించి, తాముకోరినరీతిగా చేయవలసినదని ప్రభుత్వమునకు, మిల్లుయజమానులకు విన్నవించిరి.

—

## బొంబాయి భారతమహిళ విశ్వవిద్యాలయ పట్టప్రదానసభ

—

బొంబాయినగరములోని సర్ కవాస్జీజహాంగీరు పబ్లికుహాలులో మొన్నటి జూలై ౨౬ సాయంకాలము ౫౹ గంటలకు ఆక్స్ఫర్డు విశ్వవిద్యాలయోపాధ్యక్షులగు డాక్టరు పరంజపె ఎం. ఏ., బి.యస్.సి. గారి అధ్యక్షతక్రింద భారతమహిళా విశ్వవిద్యాలయపక్షమున "సాంవత్సరిక పట్టప్రదానసభ" జరుపబడినది. హాలంతయు ప్రేక్షకులతోనిండి క్రిక్కిరిసిపోయెను. కార్యక్రమము ముగ్గురుబాలికలుచేసిన ప్రార్థనతో మొదలైనది. రిజిష్ట్రారగు శ్రీమతి శారదాదివానుగారు పరీక్షలరిపోర్టును చదివినతరువాత అధ్యక్షులచే విద్యార్థినులకు పట్టప్రదానము జరుపబడెను. భాన్సలెగారు సభకువచ్చిన విద్యార్థినులలో హైదరాబాదునుండివెళ్లిన శ్రీమతి సంగం ఇందిరాదేవినిగూర్చి ప్రత్యేకప్రశంసచేసి అంతదూరమునవున్న దక్షిణహైదరాబాదునుండి మిగులశ్రద్ధతోవచ్చిన తెలుగువిద్యార్థినియాని యందరకు పరిచయపరచిరి. పిదప యస్. వి. పట్కర్ బి.ఏ.,ఎల్.ఎల్.బి.గారు విశ్వవిద్యాలయస్థితినిగూర్చి మాట్లాడుచు బొంబాయి ప్రభుత్వమువారును, ఇండియా ప్రభుత్వమువారును చేరియొక రు౫౦౦౦ల గ్రాంటునుయిచ్చినట్లు తెలియచేసిరి. పిదప అధ్యక్షులు గంభీరోపన్యాసముచేసి విద్యార్థినులకు చక్కనిప్రబోధము గలిగించిరి. సిండెన్హామ్ కాలేజిలోని ప్రొఫెసర్ కాజీగారిచే అభివందనములు సమర్పింపబడినతరువాత సభముగిసెను.

—

## జమీందారీలను ఎత్తివేయుటకు ఆలోచనలు

—

నిన్న ఇచటకాంగ్రెసుకృషి విచారణ సంఘసభజరిగినది. జమీందారులకు కొంతధనమొసగి జమీందారీ పద్ధతి నెత్తివేయవలెనని అనుగ్రహనారాయణసింహా గారు సూచించిరి. దీనివివరములను తెలుపుటకు సింహాగారికి వ్యవధి కావలెనుగాన ఈ నెలమూడవవారమున మరల సభ జరుగును.

—



# తాటస్థ్యవిధానసంఘములో చీలికలు

## జర్మనీ, ఇటలీలతో బాటు, పోర్చుగల్ బెదరింపు

ఎట్లైననేమి, నాలుగురాజ్యముల ఏకాభిప్రాయము కుదరనందున ౬ వ జూలై వాడు ఉదయము ౧౧ గంటలకు ఇటలీమంత్రివర్గము ౧౧-౩౦ గంటలకు జర్మనిమంత్రివర్గము సమావేశమయ్యెను. బ్రిటనుమంత్రివర్గ సమావేశముకూడ జరిగెను. ఈపరిణామమునకు అర్థంగము తెలియపరచుచు ఇటలీజర్మనీప్రభుత్వములు బ్రిటిషుప్రభుత్వము వారికొక సందేశమంపినవి. కాని స్వతంత్రించి ప్రతిక్రియలను సలుపవలయునను ఉద్దేశము తమకు లేనట్లుగ ఈసందేశమున స్పష్టపరుపబడెను.

తాటస్థ్యసంఘమువారి కాపలాస్కీము నుండి విరమించుకొనవలయునని ఇటలీ జర్మనిమంత్రివర్గములు నేటిసమావేశమున తీర్మానించుకొనినవి.

### జర్మనిప్రభుత్వమువారి ప్రకటన

బర్లిను, జూలై ౭:—

తమనిర్ణయమును సమర్థించుకొనుటకు జర్మనిప్రభుత్వమువారొక పెద్దప్రకటన గావించుచు "స్పెయినుదేశమునందుగాని స్పెయిను కాలనీలయందుగాని కొంతప్రదేశమును సంపాదించుకొనవలయుననుకోరిక జర్మనీ ప్రభుత్వమువారికంతమాత్రములేదు. నాలుగురాజ్యముల ప్రతినిధులకు ఏకాభిప్రాయము కుదరనందున ఇకమీదట తమయుద్ధనావలను సంరక్షించుకొనుటకై జర్మనివారే తగుకట్టుదిట్టములను గావించుకొనెదరు. స్పెయినుదేశమునందలి బొల్షివిక్కు అదురంతములను అణచుటకై జర్మనివారుకఠినపుగువిధానము ననుసరించెదరు. దుండగీండ్రను లొంగదీయుటకుఎట్టిచర్య తీసికొనదగునో జర్మనిప్రభుత్వమువారు అట్టిచర్యయేగైకొనెదరు" అనిసూచించిరి.

ఇటలీప్రభుత్వమువారుకూడ ఇట్టినిర్ణయము గావించుకొనిఅవిషయమును బ్రిటిషుప్రభుత్వమువారికి తెలియపరచిరి.

కాపలాస్కీమునుండి విరమించుకొనుటకు జర్మనిఇటలీ ప్రభుత్వములు గావించుకొనిన నిర్ణయము బ్రిటను అధికారులకు సంతృప్తినికలుగజేసినది. ఈవివాదము ఈరూపమున పరిష్కారమగుటయే అన్నివిధములఅనుకూలముగ నున్నదనివారుతలచిరి.

జర్మనీనిర్ణయప్రకారము జర్మనిప్రజలు,వర్తకనౌకలు మున్నగువాటినిసంరక్షించుటకై గ్రాఫ్ స్పీఅను యుద్ధనావ స్పెయిను ప్రాంతమునకు పంపబడెను.

౬ వ జూలై వాడు ౭ జర్మనీయుద్ధనావలు జిబ్రాల్టరుదాటి ఆఫ్రికాయందలి అల్జిసిరాస్ రేవుపైపునకు పోవునట్లు ఒకవార్త వచ్చెనుకాని ఈవార్త సంపూర్ణముగ విశ్వసనీయములుకాదనియు ఈప్రాంతమున కాపలా కాయుచున్న యుద్ధనావలు ఈవార్తలునిజమైనవని అంగీకరించుటలేదని ౬ వ జూలై వాడు కామన్సుసభలో ఈడెనుగారు చెప్పిరి—

ఇదిఎట్లున్నను ఇటలీజర్మని ప్రభుత్వములు కాపలాస్కీమునుండి విరమించుకొనుటచే ఏర్పడినపరిస్థితులనుగురించి బ్రిటను ఫ్రాన్సు ప్రభుత్వములు కడు శ్రద్ధతో ఆలోచించెను— మధ్యధరాసముద్రమునకు కాపలాకాయుచున్న జర్మని యుద్ధనావలను విశ్రాంతికై జర్మనిరేవులకు పంపుటకును, ఈప్రాంతములకు క్రొత్తయుద్ధనావలనుపంపుటకును జర్మనిప్రభుత్వమువారు తీర్మానించుకొనిరి—

మధ్యధరాసముద్రమున ఒకవిధమగు అరాజకము వ్యాపించియుండుటచే తమయుద్ధనావలను మధ్యధరాసముద్రమున యుంచవలసివచ్చెనని ఇటలీఅధికారులు తెలిపినారు.

### స్పెయినుయుద్ధములో బ్రిటిషు ఆశయము

౬ వ జూలై వాడు జరిగిన బ్రిటిషు పార్లమెంటు కామన్సుసభలో ప్రధానమంత్రి నెవిలీ చేంబర్లేనుగారు స్పెయినుయుద్ధము యూరోపా ఖండములో అంతటను వ్యాపించకూడదని బ్రిటిషువారిఆశయమని వెల్లడించిరి— ఆ యుద్ధమందు ప్రభుత్వపక్షాభిమానముగలవారలు ప్రభుత్వమునకును, శత్రుపక్షాభిమానముగలవారు శత్రువులకును నిర్భయముగ సహాయపడుచో స్పెయినులో యుద్ధము అంతర్జాతీయయుద్ధముగ మారవచ్చును అట్లుజరుగకుండ బ్రిటిషువారు యత్నించుచున్నారు—తాటస్థ్యవిధానసంఘములో సభ్యులుకొందరు స్పెయిన్ప్రభుత్వ విజయమును, ఇతరులు శత్రువులవిజయమును కోరువారలుండవచ్చునుగాని వారలెవ్వరుగాని ఆయుద్ధము యూరోపాయంతటను వ్యాపించుటకు ఇష్టముగలవారలుకారు. స్పెయిను సముద్రతీరపు కాపలాప్రణాళికనుండి ఇటలీజర్మనీలుచాలించుకొనిపోవుటవలన మున్ముందుజర్మనీ నావయగు డ్యూచ్‌లాండుయెడ జరిగినట్టి అపచారములుజరుగవని ప్రధానమంత్రియాశించెను— ఇపుడు జర్మనీఇటలీదేశముల స్థానములో కాపలాకై ఇతరరాజ్యముల నావల నేర్పరచవలనీ యున్నదనిసూచించి, జర్మనీవాదమును, జర్మనీవర్తనమును మెచ్చుకొనిరి. దీనికి జర్మనీదేశమువారు సంతోషించిరి—

ఈడెనుగారు ఉపన్యసించుచు ౮ మాసములనుండి అమలునందున్న తాటస్థ్యవిధానము రద్దగుటకు ఏరాజ్యము ఇష్టపడదనిరి. ఏలనన ఈ అవిధానము రద్దైనచో స్పెయినుకు అయుధసామగ్రి ఎక్కువగపంపబడుననియు దానిచే నానాదేశములకు మనస్పర్థలు వైషమ్యము ఏర్పడుననియుచెప్పిరి.

జూలై ౬ వ తేదినాటి ఒక వార్తవలన ఇటలీజర్మనీలు కాపలాకాయుచుండిన స్పెయినుసముద్రప్రాంతములలోగూడ బ్రిటిషు,ఫ్రాన్సుదేశముల యుద్ధనావలు సంరక్షణబాధ్యతవహించుట కంగీకరించి అవిషయమును మరల రాబోవు తాటస్థ్యసంఘ సమావేశములో తెలుపుటకు తీర్మానించుకొనినట్లు తెలిసినది. ఇటలీజర్మనీలకు ఇది ఎంతమాత్రము ఇష్టములేనట్లు సూచనలుకలుగుచున్నవి. ఇటలీజర్మనీలు బ్రిటిషువారి నిష్పక్షపాతత్వమును అనుమానించుచున్నారు— అందుచేఇటలీలో పత్రికలు బ్రిటనునుదూషించుటయు లేనిపోనినేరములనుఅంటగట్టుటయు ఇంతకునిత్యనియమముగ నున్నది— ఇట్లుండగనులో ఏర్ కాన్ఫ్రెన్సుకంపెనీ అనుదానికి "ఏర్ అంబులెన్సు"లను పంపవలసినదిగ ఆర్డరువచ్చినంతమాత్రానికే ఇటలీపత్రికలు ఆకంపెనీవారితలలోనున్న బాస్కు ప్రభుత్వముయొక్క ఏజంటుతో ౧౨ "హాకర్ ఫ్యూరీస్లేను"లుఅమ్ముటకై ఉత్తర ప్రత్యుత్తరములు జరిపినట్లువ్రాయబడినది. ఈఆరోపణ సదరుకంపెనీచే ఖండించబడినదికూడ.

జూలై ౨ వ తేదీనాడు తాటస్థ్యవిధాన సంఘముయొక్క సమావేశములో ఇటలీజర్మనీప్రతినిధులిరువురును బ్రిటను ఫ్రాన్సులు స్పెయినుమధ్యధరాసముద్రప్రాంత నౌకా సంరక్షణమును గుత్తగాతీసికొనుట కాక్షేపణచెలిపిరి—కాని ఈప్రణాళికనుగూర్చి ఆలోచించుటకై తమతమప్రభుత్వములను కోరుట కంగీకరించిరి. అయినను తమతమదేశీయులు బ్రిటను ఫ్రాన్సు ఓడలపై ఆజ్ఞాపరులుగానుండకుండునట్లు చేసెదమనిరి. మరలసమావేశము శుక్రవారము ౨వ తేదికివాయిదావేయబడెను. మొత్తముమీద ఈసంఘములో అన్నిరాజ్యములకును ఏకాభిప్రాయము కుదరకున్నచో ఇటలీ, జర్మనీలు ౧౯౩౬వసంవత్సరపు ఒడంబడికవంటి ఒడంబడికలనాశ్రయించి ఎవరిమట్టుకు వారు స్పెయినులో జోక్యముకలిగించుకొనకుండ యుండదలచినట్లుకనపడుచున్నది. ఇదిఇట్లుండపోర్చుగల్ ప్రభుత్వమువారు తమదేశముయొక్కయు స్పెయినుదేశముయొక్కయు సరిహద్దులు కలియుచోట అటునుండి స్పెయినులోకి యుద్ధసామగ్రిమనుష్యులుపోకుండునట్లు గమనించుటకు విదేశీయరక్షకభటుల కాపలాకు అవకాశమీయరాదని తీర్మానించుకొనినట్లు బ్రిటిషుప్రభుత్వమువారికి తెలిపిరి— ఇదిబ్రిటిషుప్రభుత్వమువారికి చాలవిచారముకలిగించెను. సముద్రతీరములను నౌకలుకాపాడుప్రణాళికను అన్నిరాజ్యములు అంగీకరించుచో మరిఒకమునరిహద్దునందుండి కాపలాకాయువారలకు అవకాశమిచ్చెదమనిరి. ఈలోగాతామే కాపలావిధులను తమసరిహద్దులో నెరవేర్చెదమనిరి. ఈపోర్చుగీసువారి హెచ్చరికవలన వారలకును బ్రిటనుపైఅనుమానముగలిగినట్లు తోచుచున్నది.

ఇటలీజర్మనీలు తాముప్రత్యేకముగప్రతిక్రియలకుగడంగమని చెప్పియుండిరికదా! మింగికొలేవుకుకొంచెందూరములో ఎవరివో కొయుద్ధనౌకలు జూలై ౬ వ తేదినాడుచేరబలప్రదర్శనము చేసినట్లు స్పెయిను ప్రభుత్వమువారు తెల్పినారు. బహుశా ఇటలీ జర్మనీప్రతినిధులు తాటస్థ్యవిధానపు కాపలాసంఘముయొక్క సమావేశములో స్పెయినుసముద్రతీరమందు తమ బలప్రదర్శనమైనను చేసి బెదరించవలెనని చేసిన సూచన అమలు ఇదియనిపించుచున్నది. బ్రిటను ఇందులకంగీకరించకపోయినంతమాత్రాన ఇటలీజర్మనీలు ఈప్రయత్నమును వదలుకొనినవికావు.

---



పెట్లు యెక్కినట్లుగా బాలపాపలఆరోగ్యము ఒకనాటికంటె ఒకనాటికి అభివృద్ధినందుతూరావాలి. ఆరోగ్యమంటే అదే ఆరోగ్యము.

కాని నేడు బాలబాలికలు చాలమంది పాపము మొదట ఆరోగ్యముతో కలకలలాడుతూవుండి, హఠాత్తుగా మధ్యలో దిగజారి పోవడము మనము చూస్తున్నాము.

ఇది యకృత్ ప్లీహోదర వ్యాధి లక్షణము, కాళ్ళు పుల్లలై, కడుపు "ఢమార" మై, కనులు పచ్చబడి మలబద్ధమేర్పడి యవ్వనయాతనకు లోను చేస్తుంది జాడ్యము. దానికి

**బాలభాస్కర**

ఒకటే సరియైన ప్రయోగము. పసిబిడ్డల ఆరోగ్యమునకు బాలభాస్కర సంజీవి వంటిది. బాలభాస్కర అన్ని మందుల షాపులలోనను దొరకును.

**ఆయుర్వేదాశ్రమము.**

మదరాసు.

దొరకుచోట్లు

కింగ్ అండుకో

హైదరాబాదు, దక్కను.

రామకృష్ణాస్టోర్సు

సికింద్రాబాదు.

---

మీ శిరోజములను వృద్ధిచేయుటకు

**కామినియా ఆయిల్** (రిజిస్టరుడు)



ఇదితప్పక బట్టతలను బాగు చేయును. వెంట్రుకలు రాలిపోవుటను, అకాలమున నెరయుటను తప్పక నిలుపును. చుండును మాన్పి తలచర్మమును శుభ్రపరచి వెంట్రుకలను బాగుగపెంచును. ఇంతేగాక దీనియొక్క సువాసన మనస్సుకు మిక్కిలి ఆహ్లాదమును కలిగించును. వెల సీసా 1 కి. 1 రూపాయి. 3 సీసాలవెల రు. 2-10-0 ఖర్చులు ప్రత్యేకము. కోరినవారికి శాంపిల్ అర్ధణాస్టాంపు పంపినయెడల ఉచితము

సువాసన ద్రవములలో రాజు

**ఓటో దిల్ బహార్** (రిజిస్టరుడు)



ఇది సమ్మోహనము కలుగజేయు సువాసన నిచ్చునట్టి ప్రీతికరములగు కోమలకుసుమములనుండి తీయబడినది. అందువలన ఒకచుక్క ఉద్యాన వనమునందలి వేలకొలది అప్పుడేకోసిన పూలనుండి వచ్చు మనోల్లాసకరమైన సౌరభమును వెదజల్లును. పోస్టేజికొఱకు 2అణాల పోస్టుబిళ్లల పంపినచో సాంపిల్ ఉచితము.

1/4 ఔన్సుసీసా 1 కి 1-4-0; ఒక డ్రాము సీసా 1 కిఅణాలు 12.

వి. పి. చార్జీలు ప్రత్యేకము.

సోల్ ఏజంట్లు:—

**ది ఆంగ్లో ఇండియన్ డ్రగ్ & కెమికల్ కంపెని,**

285, జుమ్మామసీదు. బొంబాయి.

---

**మంచిసౌకర్యము త్వరపడుడు**

మావద్ద తెలుగు, ఇంగ్లీషు, ఉరుదు స్కూలుపుస్తకములు, ఆంధ్రగ్రంథములు, నవలలు, నాటకములు, కావ్యములు, యక్సరసైజు నోటుబుక్కులు, స్టేషనరీసామానులు వగయిరా సరసమయినధరలకు దొరకును.

**ఆంధ్రశ్రీకంపెని**

నెం. ౨౨౦ సుల్తానుబజారు

హైద్రాబాదు-దక్కను.

# ఐర్లాండు ఎన్నికలలో డివేలరాగారి సామాన్య విజయము

ఐర్లాండు పార్లమెంటు ఎన్నికలలో డివేలరాగారు, ఆర్థికశాఖమంత్రి మకెంటిగారు. పోస్టు టెలిగ్రాఫుశాఖ మంత్రి లేబారుగారు గెలుపొందిరి.

క్రాస్‌గ్రేవుగారు కౌర్కు-నుండి తిరిగి ఎన్నుకొనబడిరి- జనరలు ముల్కాహీగారు డబ్లినులో ఓడిరి.

ఎన్నికలఫలితములు పూర్తిగారానున్న బుధవారమువాడుగాని ప్రకటించబడవు. ఈలోగా ఇప్పటికి తెలియబడుచున్న ఫలితములను చూడగా డివేలరాగారిపక్షమువారు ౫౯ మందియు, కాస్గ్రెవుగారిపక్షమువారు ౩౭ మందియు, లేబరుపక్షమువారు ౧౧ మందియు, ఇండిపెండెంట్లపక్షమువారు ౯ మందియు గెలిచినారు. ఇంకను ౨౨ స్థానముల ఫలితములు తెలియవలసియున్నవి- ఈఎన్నికలలో డివేలరాగారు మరియొక పక్షము యొక్క సహాయము లేకుండ తనపక్షము రాజ్యము నేలవచ్చునని ఆశించెను- కాని ఇపుడు డివేలరాగారిపక్ష బలమునకును తక్కిన మూడు పక్షబలమునకును వార్త మాత్రమే. ఇంకను ఫలితము తేలవలసియున్న ౨౨ స్థానములలో ఎన్నిస్థానము లింతకును డివేలరాగారి పక్షమునకు వచ్చునో నమ్మకము కనబడుటలేదు-

# రాష్ట్రీయ శాసన సభల సమావేశ దినములు

జూలై ౧౪వ తేదీని మదరాసు అసెంబ్లీసభయు, మదరాసు కౌన్సిలు సభయునుగూడ జరుగును.

౨౨-౨౩ తేదీలలో బీహారు శాసనసభ జరుగును.

పూనాలో కౌన్సిలుహాలులో జూలై ౧౯వ తేదీ మధ్యాహ్నము ౨ గంటలకు అసెంబ్లీసభయును, ౧౨వ తేది మధ్యాహ్నము ౨ గంటలకు కౌన్సిలుసభయును జరుగును.

ఈనెల ౨౯వ తేదీని లక్నోలో సంయుక్త రాష్ట్రముల శాసనసభ జరుగును.

# సరిహద్దులో పోరాటము

జూన్ ౩౦, జూలై ౧వ తేదిరాత్రి తలింతోచి క్యాంపుసమీపమున తుపాకులు ప్రేల్చ ఫలితము లేకుండెను. రజాని, రజూమకు నడుమల మధ్య తాత్కాలికముగా యేర్పాటుచేసిన టెలిగ్రాఫుతీగెలకు కొంతనష్టము కలిగెను. మిగత క్యాంపులలో శాంతముగానుండెను. ౧వ తేది వజీరుస్థాన్ సైన్యము టోర్యంనుండి చర్వేషికి వెళ్లిరి. వెనుకనున్న వారిపై కొండజాతులవారు కొన్ని తుపాకులు ప్రేల్చిరి.

# విచారణలేకుండ ఖైదీగ నుంచు పద్ధతి

## బెంగాలు ప్రభుత్వ చర్యలు నిరసనము

జూలై ౨ సాయంకాలము కలకత్తా అల్బర్టుహాలులో శరచ్చంద్రబోసు అధ్యక్షతక్రింద జరిగిన బహిరంగసభకు పెక్కు-వందలమంది ప్రజలువచ్చిరి. బోసుగారు సభను ప్రారంభించుచు యిటులనుడివిరి “విచారణలేకుండ నిర్బంధమునందుంచబడినవారని విడుదల చేయుటనుగూర్చి ఏ. కే- ఫజలలుహక్కు-గారుయిటీవలనుడివిన వాక్యములనుబట్టి ఆతడు బెంగాలు గవర్నరుకు ప్రధానమంత్రిగాని బెంగాలుప్రజలకు ప్రధానమంత్రి కాదనిస్పష్టముగా తెలియుచునేయున్నది- ఈఫజలల్లుహక్కు-గారే, యీనడుమంతరపు మంత్రిపదవినిస్వీకరింపకపూర్వము యీ హాలులోనే ఉపన్యసించుచు విచారణలేకుండనిర్బంధించుపద్ధతి మిక్కిలిఅనుచితమని నిష్కర్షగా తెలిపియుండిరి. అప్పుడాసభకు అధ్యక్షుడుగానుండిన హకుగారు తెలిపిన విషయములకు ఇప్పుడుగవర్నరుప్రధానమంత్రిగానుండిన, హకుగారు శాసనసభలో తెలిపినవిషయములు కేవలము విరుద్ధముగానున్నవి_ కావున బెంగాలులో విద్యార్థులు స్త్రీలున్నగువా రందరును యిందులకు తమఅసమ్మతిని మిక్కిలిస్పష్టముగా తెలుపవలెను- నేనుగూడ కొంతకాలము విచారణలేకుండ నిర్బంధింపబడినవాడనే”అని బోసుగారు తెలుపుచు తమఅనుభవములను సభలోవివరించిరి.

ఈనెల ౨౯వ తేదిని బెంగాలు అసెంబ్లీసభ జరుగునుగానపుడు పౌరులు వేలకొలదిగా సభాభవనముకడకు రాగోరెదను. పౌరులటుల చేసినచో డిటన్యూలనందరిని వదలివేయవలెనని ప్రజలందరునుకోరుచున్నారని స్పష్టముగును గాని అట్టిప్రజాభిప్రాయమును తిరస్కరించుటకు దొరతనమువారును మంత్రులునుగూడ సాహసింపజాలరు.

ఈనెల ౨౯వ తేదిలోగా దేశమునందంతటను డిటన్యూలదినమును జరుపవలెను-డిటన్యూలనుగూర్చి అనుసరింపవలసిన కార్యక్రమమును బెంగాలుకాంగ్రెసు సంఘమువారు త్వరలోనే ప్రకటించెదరు- ఆకార్యక్రమమును ప్రజలందరును కొనసాగింపగోరెదను. యువకులనుయువతులనువిడుదలచేయక పోవుటకు గల కారణము అనుబహిరంగసభలో హకుగారును యితర మంత్రులును తెలుపగలరా అని నేనడుగుచున్నాను” అని బోసుగారునుడివిరి.

### శాక్జనాగారు

బెంగాలుయువజనులలో విఖ్యాతులగువారినందరిని దొరతనమువారువిచారణలేకుండ నిర్బంధించియున్నారు-వారినందరిని వదలెడువరకును దేశమునశాంతియేర్పడదు. మంత్రులిప్పటరులకుచేసిన వాగ్దానములను భంగపరచుచున్నారు-వీరునిజముగా ప్రజాప్రతినిధులేయైనచో నిరపరాధులగువారినందరిని వెంటనేవదలివేయవలెను-కఠినపద్ధతులవలన యేదేశములోను యెట్టిమేలును కలిగియుండలేదు, ప్రజాభిప్రాయమునకుమించినచట్టము మరేదియును లేదు- దానినినెవ్వరును తిరస్కరింపలేరు-దొరతనమువారుకఠినవిధానముపై ఆధారపడుటవలన వారు పెడదారిబనిడినవారైరి. విడుదలచేయబడినవారుజీవింపగల్గుటకు తగినయేర్పాట్లను చేయుటకు కాంగ్రెసువారునుయితరులునుకలిసి ఒకసంఘముగా నేర్పడవలెను. విద్యార్థులుగూడ డిటన్యూలనిధికి శక్తివంచనలేకుండ ధనమును పంపుకూర్పగోరెదను. అని అధ్యక్షుడగు మోహనలాల్ శాక్జనాగారునుడివిరి-

విచారణలేకుండ నిర్బంధమునందుంచుపద్ధతినింకనుఅమలులోనుంచుట మిక్కిలిఅనుచితము-వీరినందరినివెంటనే ఎట్టిషరతులను కోరకుండ విడుదలచేయవలెను. జైళ్లలోను శిబిరములలోను యిండ్లలోను నిర్బంధింపబడినవారినందరినివదలివేయవలెను. ప్రధానమంత్రి యీవిషయమున నిటీవలచేసినప్రసంగము మిక్కిలి అనుచితము మంత్రివర్గముపై నీసభవారికిలేశమైనను విశ్వాసములేదు.”అని తీర్మానమువాహింపబడెను.




## ప్రకృతి చికిత్స

శ్రీయుత మహాదేవదేశాయి గారు "హరిజన్" పత్రికయొక్క ఒకసంచికలో కాలెన్బాకుగారికి ప్రకృతిచికిత్సయందుగల అప్రతిహతమైన విశ్వాసమునుగురించిచెప్పుచు ఇట్లు వ్రాసినారు.

"కాలెన్బాకుగారికి ప్రకృతిచికిత్సయందును జలచికిత్సయందును మృచ్చికిత్సయందును-గల గాఢమైన అభిమానమునుగూర్చి ఇదివరలో చెప్పియుంటిని. వారిరమ్యమైనపలువరుసనుచూచి ఆశ్చర్యముతో నేను, అవిమోసముకాదుకదాయని అనుమానించితిని." "నాపళ్లములలో నొకటియు మోసమైనదికాదు. 30ఏండ్ల శాకాహారపోషణ ఫలితములవి - దంతములసందులందు ఇరుకుకొనియుండు పదార్థమునుతొలగించుటకు భారతీయులుపయోగించునట్లు సన్నపుల్లలనుపయోగించుపద్ధతిని, నాలుకను భారతీయులవలెగీకి శుభ్రపరచువిధమును బాపు నాకునేర్పెను - నేనెక్కడకుపోయినను ఆరెంటినితీసికొనిపోవుచుందును -"

"నీకెప్పుడుగాని ఏజబ్బు చేయలేదా?"

"ఎప్పుడో ఆకను - ఒకటిరెండురోజులు జబ్బుగాగాని అస్వస్థతతోగాని ఉండినప్పుడుకూడ నేను మందు మ్రింగలేదు - నేను వైద్యుల సలహానడిగితినిగాని వారలమందులుతీసికొనలేదు. ఒకప్పుడు నాకు లోపల ఏదో అడ్డగించినట్లుండ అన్నము మాని పండ్లరసము మాత్రము త్రాగియుంటిని - మరలఎప్పుడుగాని నాకే బాధకనపడలేదు - నావ్యాయామము, కాయకష్టము అనిన చాలఇష్టము - నేను నాపనిమనుష్యులతోకలిసి ఉత్తఒంటితోనే పనిచేయుచుందును -

"యుద్ధములో ఖైదీగాపట్టుబడి అలెగ్జాండ్రా ప్యాలెస్ క్యాంపులో నుంచబడినపుడు జరిగిన ఒకవిశేషమునుగూర్చి చెప్పెదను - ప్రతివారము నావద్దకు మిత్రులువచ్చిచూచి పోవుచుండెడివారు - ఇట్లుండ ఒకనాడొకరువచ్చి నాదాయాది ఒకదురు యెమ్మూభాగమున మేహాజమైకోలుకపుండుచే బాధపడుచుండినట్లు నాకుచెప్పిరి - కారాగారములోకూడ నాకుకొందరు తోడుగానుందునట్లు చేసికొంటిని - మేమందరము శాకాహారము అనుభవించుచుండెడివారము - దైవవశాత్తున మేహపుకోలుకపుండును శాకాహారపద్ధతిచే మాన్పువిధమునుగూర్చి డాక్టర్ బెల్ గారువ్రాసినపుస్తకమును నేనంతకుముందేచదివియుంటిని - బెల్ గారు సామాన్యులుకారు - సుప్రసిద్ధవైద్యులు - కోలుకపుండునుగూర్చి పరిశోధనజేయు ఒకసంస్థకు కాన్సర్ రీసర్చి సొసైటీ - అనిదానిపేరు - అధ్యక్షులు నాదాయాదితని చెప్పియుంటినే ఆమె అయిదుగురు సర్జనులను అడుగగా, వారలందరును వెంటనే ఆపరేషను చేయవలెనని చెప్పిరని నేనువింటిని - అందుఒక సర్జను ఆమెకు ఆపరేషను చేయనియెడల ఆరునెలలైనను బ్రతుకుననుటసందేహమని చెప్పెను - ఆమె మంచిరూపవతి, ఆకారపుష్టిగలది - అందుచే ఆవిషయముపై నాకు శ్రద్ధకలిగెను - ఆమెను వలుపటివారము నావద్దకువచ్చిచూడవలసినదని నామిత్రులతో చెప్పిపంపితిని - వారలు ఆపరేషను తీర్మానించబడినట్లును, రోజుకూడ నిశ్చయించబడినట్లును, దానినిఅపుటకు సాధ్యముకానట్లును చెప్పిరి - అంతేగాక అయిదుగురుసర్జనుల సలహాపొందబడెను - అంతకంటె ఈ డాక్టర్ బెల్ గారేమి చేయగలరు? ఆపరేషను తీర్మానించుకొనబడినను, ఆపరేషను చేయించకయే సర్జనుకు ఇవ్వవలసినఫీజు ఇచ్చివేయవచ్చునుగాని, ఆపిల్లప్రాణము మాత్రము పోగొట్టవలదనియు నేను సూచించితిని - అయిదుగురుసర్జనుల సలహాతీసికొనినతర్వాత, ఆరవసర్జను సలహాను మాత్రము తీసికొనిన ప్రమాదమేమి? ఇట్లు ఎంతోదూరము బోధించగా బోధించగా, తుదకు నన్నుమాటకు ఆపిల్ల తల్లిదండ్రులు వారలంగీకరించిరి - నేనామెతో చాలసేపు మాట్లాడి, డాక్టర్ బెల్ గారినిచూడవలసినదిగ చెప్పితిని - తుదకామె అంగీకరించెను - డాక్టర్ బెల్ గారుకూడ తక్కినసర్జనులవలెనే చెప్పినచో ఆపరేషను చేయించుకొనవచ్చునని నేనంటిని - ఆమె డాక్టర్ బెల్ గారినిచూచెను - అప్పటికాయన చాలముసలివాడు - అతడాపిల్లను సంపూర్ణముగా పరీక్షించి, తక్కినసర్జనులు నిజముగా పొరబడియుండవచ్చుననియు, స్తనమునుండి నెత్తురుకారుట ఒక్క కోలుకపుండుయొక్క లక్షణము మాత్రమేకాదనియు చెప్పి, ఆమెను ఎక్కడికైన శాకాహారాశ్రమమునకుపోయి, అచటరెండునెలలు చికిత్సపొందవలెనని సలహాఇచ్చెను - నన్నంతట ఆఖైదునుండి పంపివేసిరి, మరల నేను ఆపిల్లను ఒకటిన్నరసంవత్సరమువరకు కలిసికొనలేదు - ఆతర్వాత మరల ఇరువురము కలిసికొనినప్పుడు, ఆపిల్లతాను ఆపరేషను చేయించుకొనక బెల్ గారి సలహాప్రకారము నడచుకొనినట్లు చెప్పెను, బెల్ గారు చెప్పిన ఆశ్రమమునకుపోయి చికిత్సపొంది, మరల బెల్ గారిని సందర్శించెను - ఆమెశరీరమందు మేహవ్యాధి ఎన్నడును లేదు - ఇది ౧౯౧౬వ సంవత్సరాంతమున జరిగినసంగతి - ఆమెనిపుడు నేను లండనులో చూచినాను - ఆమెకు ౨౦ఏండ్లు పూర్తిగానిండినవి - శస్త్రచికిత్స అవసరమని నేను చెప్పను - కాని మనము ఆహారవిహారములలో మార్పుచేసి రోగము కుదురునట్లున్నప్పుడుకూడ మందులకొరకు ఆపరేషనులకొరకు ఉరుకులాడుచుండుట ఎందుకు అనియే నేనడుగునది -

—

# గోలకొండపత్రిక

# GOLKONDA PATRIKA

HYDERABAD-DECCAN

The First Telugu Bi-Weekly in Andhra Desa and the leading Telugu Newspaper of H.E.H. The Nizam's Dominions.




Vol. 12. | Thursday 8—7—1937 | No. 18

# నిజాంరాష్ట్రీయయువకులకు సరోజినీదేవి ప్రబోధము

గతగురువారము నాడు మధ్యాహ్నము నైజాం కాలేజి యూనియనుయొక్క ప్రారంభోత్సవ సందర్భమున గౌరవనీయులగు న్యాయశాఖామంత్రియగు నవాబ్ మిర్జాయార్జంగు బహదర్ గారి అధ్యక్షతన శ్రీమతి సరోజినీనాయుడుగారు "రేపు మీరేమి చేయనున్నారు" అను విషయమునుగూర్చి ఉత్తేజకరమగు ఉపన్యాసమొసగెను. అధ్యక్షులవారు సరోజినీదేవినిగూర్చి పరిచయవాక్యముల నుడువుచు ఆమె ఆరోజు విద్యార్థులసభలో నుపన్యసించుచుండ మరునాడు చాలముఖ్యమైన ఒకరాజకీయసంస్థలో నుపన్యసించవచ్చుననియు ఇంకొకరోజు కవులసభలో మాట్లాడవచ్చుననియు చెప్పిరి. సరోజినీదేవి మఱుసటిరోజు రాజకీయసంస్థలో పాల్గొనువిషయమై సందేహమేమియు లేదనుచు "మనదేశముయొక్క భవిష్యత్తునుగూర్చి శ్రద్ధతో ఆలోచించు సమావేశమందు నేనుతప్పక పాల్గొనుచున్నాను. ఆయాలోచనలు మీరుకూడ చేయుచున్నారు. మీరు భారతదేశముయొక్క గతియెట్లైననేమియని అనుకొనజాలరు. మీరిక ఎంతమాత్రము బయటిభూభాగములతో సంబంధములేని స్వతంత్రపౌరులని తలచరాదు. హైదరాబాదుయొక్క గతి ప్రపంచపరిస్థితులనుబట్టి మారునట్లే, మీస్థితియు యావద్భారతదేశస్థితినిబట్టి మారగలదు."

తర్వాత సరోజినిగారు హైదరాబాదు సంస్థానసేవలో రాష్ట్రీయులు చేయవలసినవిధుల నుపేక్షించుచు "మీరు స్వార్థరహితులగు మానవులుగనుండవలెను," అనియు "కళాశాలలలోను, పుస్తకములలోను దొరకునదిబోధగాని విద్యగాదు.........విద్యయనగా జ్ఞానముచే పుష్టిపొందిన ప్రపంచమునకు పుష్టినిచ్చుసంస్కృతి (Culture)అ" అనియు, పూర్వులగొప్పతనమును చెప్పుకొని "ఉత్తమాత్మశ్లాఘ చేసికొనువారముగ నుండరాదు. ఏలనన మనము రేపు రాబోవుసంతతికి పూర్వులమగుదుము అనుమాట జ్ఞప్తిలోనుంచుకొనుడు, మనపూర్వులకు తగినసంతతివారము అనిపించుకొని, పూర్వులయెడ గౌరవభక్తులుగలిగి గర్వించగలిగిననేగాని, మనగర్వించగల పెద్దలముకాజాలము" అనియు, పూర్వముననుసరించవలయుననుటచేత, సర్వముగతించినదానినే అనుకరించుట అర్థముకాదనియు, మనపూర్వులు తేవారల పూర్వులకు పూర్వులతో భేదించి యుండిరనియు. మనము స్వతంత్రయోచనశక్తి గలిగియుండుటయే విద్యాఫలమనియు, విద్యసూర్యుని వెలుగువలె అంతట వ్యాపించుటకు యత్నము చేయవలెననియు, హైదరాబాదు పత్రికలను బాగుచేయవలెననియు, మాటలచేతను, వ్రాతలచేతను "శాంతిసౌభాగ్యములను సృజించవలెనేగాని విభేదములను అనుమానములను కొట్లాటలను సృజించరాదనియు చెప్పిరి. ఈవిషయము నేని స్తరించుచు నిట్లుచెప్పిరి: "భారతదేశమునకు ఐకమత్యలోపమునుతప్ప మరేమిలోపమున్నది? ఈలోపమునకు కారకులు ఉపన్యాసకులును, వ్రాతగాండ్రును గాక మరెవరగుదురు. నిజముగా మాటలాడువారును వ్రాయువారలును దొమ్మలకు కారణభూతులు. నేనిదికండ్లార చూచియున్నాను. ఇట్లువిభేదములను పురికొల్పుచు రెండుతెగలకుచెందిన ఇద్దరు తెలివిమాలినవారలపోట్లాటను పెద్దదానినిగజేయుటెందుకు, ఈరీతిగ మనదేశమునకు అవమానము కలిగించుటెందులకు? ఎందులకో? స్వార్థమునకు సృష్టికంటె సంహారము తేలిక మానవులకమనీయగుణములను పోషించుటకంటె దుష్టబుద్ధులకు దోహదమిచ్చుటసు సాధ్యతరము"

"హైదరాబాదీయులగుటచే మీకుగల ఇతరబాధ్యతలన్నిటికంటె మించినబాధ్యత ఐకమత్యసంప్రదాయమును కాపాడుటయైయున్నది. నేను నివసించుచు సంచారము చేయుచుండు బ్రిటిషుఇండియా యనెడిబయటిదేశములో వారలు మనసంస్థానములోనుండు ఐకమత్యమునుగూర్చి చాలగొప్పగా చెప్పుకొందురు. ఈఅసఫుజాహి రాజ్యములో మానవసోదరత్వ మూలములుగలవని నేనుఎప్పుడును సమర్థించుచుందును. మరిచ్చుటగాకున్నను. ఇచటనైనను మనము భిన్నములైనతెగల ఐకమత్యమునుగూర్చిసమస్యను పరిష్కరించినామని నేను చెప్పుచుందును. మరికొందరు హైదరాబాదును హిందూముసల్మానులు సోదరభావముతో ఐకమత్యముతో పనిచేయు ప్రదేశమునకు లక్ష్యమునగ జెప్పినారు. కనుక మిమ్ములనుగూర్చి ఎవరుగాని మీరు మైత్రిలోపము అనుమానించబడునట్లు ఏమాత్రపుసూచననైనను వదలినటుల చెప్పబడకుండునట్లు నడచుకొనవలెను. ఏలనన భారతదేశముయొక్క గతియంతయు భారతీయుల ఐకమత్యముచేతనే నిర్ణయించబడవలసి యుండును, నేను అధికసంఖ్యాకుల తెగకు చెందును. అతడు ఇంకొకతెగకుచెందును అనుపరిగణనలు ఇకనెంతమాత్రముఉండరాదు. వంటిపరిగణనలుఉండునంతవరకు మనము ఒక్కజాతిగాక అంతర్భేదములుగల కొన్నితెగల సముదాయముమాత్రమే యగుదుము. హైదరాబాదులో మీరిచట ఒకచిన్న భారతదేశము నాటిప్రదేశములోనున్నారు. కనుకమీరు అల్పసంఖ్యాకుల సమస్యలు అధికసంఖ్యాకుల సమస్యలనునవియు, భాషాభేదసమస్యలును, కులభేదములసమస్యలును లేవనియు, రాజ్యములో అన్నితెగలవారలును ఏకోద్దేశ్యమునకైకలిసి పాటుపడునపుడే అందరును నిజమైన పౌరులగుదురనియు మీఆచరణచే అందరికిని బోధపడునటుల చేయవలెను: మీవృత్తులుఏవైనను యగుగాక, మీరు యంజినీర్లుకానిండు, ఉపాధ్యాయులుకానిండు, బ్యాంకర్లుకానిండు, గుమస్తాలుకానిండు, మిమ్ములను ప్రేరేపించుఆదర్శము ఆతెగయొక్క సేవగాని ఈతెగయొక్కగాని సేవమాత్రమేగాక, అందరిఅభివృద్ధికై సహకారపద్ధతికై చేయబడుసేవగానుండవలెను. ఈభేదములవల్ల కించిత్తైనను ప్రయోజనములేదు. రాజ్యముయొక్క అభివృద్ధివలన అంతయు ప్రయోజనమే."

## స్త్రీలబాధ్యతలు

స్త్రీలహక్కులను బాధ్యతలనుగురించి చెప్పుచు సరోజినీదేవిగారు తనకెల్లప్పుడును స్త్రీలహక్కులు స్త్రీలహక్కులుఅని పోరాడుచుండువారినిజూచిన ఓర్పుండదనిరి. ఘరిమన్నిసుసుంశీసరిగారు స్త్రీలహక్కులకు పోరాడువారు తనకూతురగు లీలామణినాయుడు ఆతకంటె ఎక్కువగ స్త్రీలహక్కులకై పోరాడునది. తానుమాత్రము స్త్రీలబాధ్యతయని విభేదము చేసి చెప్పక ఒకటేబాధ్యతను స్త్రీపురుషులు సమముగా భరించవలసియున్నదని భావించుచున్నాననెను. మానవులు ఎట్టిశక్తితో ఏకార్యమునైనను సాధించవలసి యుండునుగాక ఆబాధ్యతను స్త్రీపురుషులు సమానముగా పంచుకొనవలసి యుండును. తాను స్త్రీ ననుకారణముచే తనకు గొప్పహక్కు కావలెననికోరునది రాజ్యమునుండి వెడలగొట్టబడవలెను. ఉదాహరణార్థము ఒకస్త్రీ ఒకసభకువచ్చినపుడు అక్కడ ఎవడుగాని ఆమెకు ఆసనమిప్పించలేకపోవును. అంతులకై ఆమెపురుషుడు కఠినుడనియు, స్త్రీలయెడ మర్యాదలేనివాడనియు నిందించరాదు. తాను స్త్రీననుకారణముచేతనే తనకు గౌరవము రావలెననికోరరాదు.



మనఆదృష్టవశమున అట్టిభారములుండెడి విక్టోరియాకాలపు రోజులు ఎన్నడోపోయినవి నేను స్త్రీ "నేను అబలనుకాను, నాకు ప్రత్యేకస్థానము అక్కరలేదు." అని చెప్పవలెను.

ఇదేసందర్భమున సరోజినిదేవి ఇటీవల బ్రిటిషుఇండియాలోని రాష్ట్రములందు జరిగినఎన్నికలలో స్త్రీలవిజయమునుగూర్చి చెప్పుచు ఆఎన్నికలప్పుడు ఒకఆంగ్లేయస్త్రీ "పాపము భారతీయస్త్రీలకు శాసనసభలలో స్థానములను రిజర్వు చేసియుంచవలెను. లేనిచో వారెట్లు గెలువగలరు?" అనుచుండగా సరోజినీదేవినేను. "ఎందుకుగెలువలేరు" అని జవాబిచ్చెను- జరిగినఎన్నికలలో స్త్రీలకై ప్రత్యేకించబడని సామాన్యస్థానములలోగూడ స్త్రీలను అభ్యర్థులనుగ నిల్పినచోట్లనెల్ల ఒక్కస్త్రీనైనను పురుషుడు ఓడించలేదు- స్త్రీలుతాము శాసనసభలలో చేయదలచిన కార్యక్రమమును నిర్ణయించుకొని దానిని ఓటుహక్కుగలవారలకు తెలియబరచి వారలఓట్లుకోరిరి- సంయుక్తరాష్ట్రములో ఒకస్త్రీకి ఎన్నికలలో పోటీచేయుటకు ధైర్యముమాత్రమే యుండెను- కాని మోటారుకారులేదు, డబ్బులేదు- ఓట్లుఇచ్చురోజున ఓటర్లు "విద్యాబాయి వచ్చుచున్నది, చింతాబాయిఎక్కడ" అనిరి- చింతాబాయి అనగా విద్యాబాయితో పోటీచేసిన అలహాబాదు "లీడరు" పత్రికసంపాదకులగు సి-వై-చింతామణిగారుఅని తమాషాగా పేర్కొనిరి- చింతామణిగారికి ఎన్నికలు అచ్చిరాలేదు- కొన్నివారములక్రిందట పరీక్షలఫలితములు ప్రకటించబడినప్పుడు ఎందరో తల్లిదండ్రులు తమబాలికలు ప్రక్కయింటివారల కొడుకులను ఓడించినట్లు కనుగొనిరి- మున్ముందు స్త్రీలకుప్రత్యేకములైన హక్కులుండజాలవనియు అందరును సమానభాగస్వాములుగ నుండవలసియుండుననియు సరోజినిదేవి చెప్పెను-

కలకత్తాలో సర్ జగదీశబోసుగారి ఇన్స్టిట్యూటులో ముందరరోజులెట్లుండునది ఉదహరించుచిత్ర మొకటిగలదు- బోసుగారు స్త్రీకైనను, పురుషునికైనను, మానవునికైనను పశువులకైలను ప్రాణముఒకటేయని నిరూపించినారు- వారివద్ద నుండుచున్న కత్తిపట్టుకొన్న ఒక పురుషునిను, పిల్లనగ్రోవిమాత్రమేగల ఒకస్త్రీయును చిత్రించబడిన పటమొకటిగలదు- ఆపురుషుడు అలసిపోయినట్లు కనపడుచుండును- స్త్రీమాత్రము "నాకుబలములేదు, నీకుక లెకండరపుష్టిలేదు నేనువిశ్వాసముతో ప్రేమించు పిల్లనగ్రోవిమాత్రమేగలదు" అనిచెప్పుచున్నట్లు కనపడుచుండును- ఆస్త్రీ పిల్లనగ్రోవి ఊదుచు ఆపాట పురుషునిశ్రమను పారద్రోలి క్రొత్త ఉత్సాహము నొసగును- స్త్రీపురుషుల సంబంధము ఇట్లుండవలెను- ఇదే స్త్రీపురుషులభవిష్యత్తుఅని సరోజినిదేవి ఉపన్యాసము ముగించెను-

అధ్యక్షులగు నవాబ్ మిర్జాయార్ జంగుబహదర్ గారు సరోజినిదేవిగారి అభిప్రాయములనన్నిటిని సమర్థించిరికాని స్త్రీలకుమాత్రము మొదట కొన్నిహక్కు లవసరమనిరి-

# రైలుబండ్ల నిర్మాణమునకు రు ౪ కోట్లఖర్చు

ఇండియాప్రభుత్వపు రైల్వేఆర్థిక స్థాయిసంఘము ఆమోదించుట

రైల్వేఆర్థిక కమిషనరు బి-యం- స్టెయిగుగారి అధ్యక్షతక్రింద, రైల్వేఆర్థిక స్థాయిసంఘము నేడుకూడియుండి, నూతనరైలుబండ్లను నిర్మించుటకై నాలుగుకోట్ల అయిదులక్షల ముప్పదిఎనిమిదివేల రూపాయలను వెచ్చించుటకు చేయబడిన సూచనలను ఆమోదించినది- ఆమొత్తము దిగువతెలుపబడిన తెరగున నాలుగుశీర్షికలక్రింద వెచ్చింపబడుటకు నిశ్చయింపబడినది- లోకోమోటివులు, బాయిలర్లు:-ఎనుబదిఏడులక్షల ఎనుబదిఎనిమిదివేలు- క్యారేజీలు:-ఒకకోటి ముప్పదిఎనిమిది లక్షలు- వాగనులు:-ఒకకోటి ఏబదిరెండులక్షల డెబ్బదివేలు- రైలుకారులు:-(పరీక్షార్థము) ఇరువదిఆరులక్షల ఎనుబదివేలు-

గొప్పఖర్చులలో రెండవస్థానమునందున్నది ప్రయాణీకుల క్యారేజీలకు సంబంధించినది- ఈశకటములలో, పదునేడు పైతరగతికి చెందినవి- ఇరువది మిశ్రమరకముబండ్లు- ఏబదిరెండు ఇంటరుతరగతికి చెందినట్టివిగనో లేక మూడవతరగతికి చెందినట్టి ఉత్తమతరగతికి చెందినట్టివిగనో యుండును- రెండువందల డెబ్బదిఆరు శకటములు క్రిందితరగతికి చెందినవి- మూడవతరగతి ప్రయాణీకుల నిమిత్తముగ చాలవెచ్చింపబడుచున్నదని భావము-

Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda PowerPress Hyderabad. Editor K. Balakrishna Reddy